కని మహురుసన్నమన్మృగముఖంబున సాఁదుసాఁదు స్సలా
మొనరుచు దీసఁ గైగొని జయోన్నతిఁ జెందుము రాజనందనా 43

చ. అనిన మహాప్రసాద మిపు డానతి యిచ్చితిరేకదా యిఁకం
గనఁబడఁ దెల్పనేమిటికిఁ గార్యముఖంబున స్వామిచిత్తమే
ననుచు నదేల కావలసినం దనుజు న్వధియింపఁ జాలరే
ననుఁ గరుణావలోకనమునం ఘనుఁ జేయఁగఁగాక వచ్చటల్. 44

సీ. చాయలొందినదంచు సంతరించిన వాలుచూరకత్తి పరీక్ష చూడఁగలిగె
తరతరంబులనుండి దాఁచినా రనివిన్న కఱకునేజామేలు గాంచఁగలిగె
ననిలోనఁ దనుఁగాదు ననిచెంచులర్పించు కేడెంబువాడి వీక్షింపఁ గలిగె
పందెమొగ్గినఁ గూడఁ బగఱ గెల్చుకటారియిదిపేని వగసచ్చయింపఁగలిగె
స్వామి మీకతమున నిట్టి చోకపసకి, మీరు వేంచేయవలయు నే మీగృహమున
కరుగుదెంచితి రందులకనుట కాదు, పదములెక్కడ బడలెనోకద మునీంద్ర. 45

చ. అనిమహిజాని యీడిగపుటాప్తులఁ గన్గొని దండు చాలుగాఁ
బనుపుఁడటంచుఁ బల్కి మునిపాలకమౌళికిఁ గేలుమోడ్చి స
ద్వినయవినమ్రుఁడై నిలిచె వెంబడిగా నరుదెంతు మున్నుగాఁ
జనుఁడని వీడుకొల్పి హరి సాహిణి నీవశమంచుఁ బల్కుచున్. 46

చ. గడెలు పదాఱు చెల్లె ననఁగా విని కట్టికవారు మ్రోతిగ
స్వర నవధారు దేవ జతనాయన గద్దియ డిగ్గి యంపటి
న్వడిపలకంపి మౌళిసరణిన్ హరిగల్నిగుడంగ జెట్లు వెం
బడి కయిలా గొసంగఁ దెలిపావలు మెట్టి యొయార మేర్పడన్. 47

శా. క్షోణీహికిట వారినిల్పి కులుకుంగుత్తంపుఁ జన్గుబ్బలే
జాణల్ క్రొందఱు కుంచెలొండి యడపా ల్సాగింప వాణీరణ
ద్వీణాపాణులు కొండఱారతిగముల్దీర్పంగఁ గఞ్చాంతర
శ్రేణుల్దాఁటి నృపాలుఁ డంతిపురముం జేరెం బ్రమోదంబునన్. 48

వ. అంత. 49

క. దనుజాతఖండనోద్ధతిఁ, జనుమనుజాధిపుప్రతాపజాతము మునుముం
గనిపించె ననుచు జనము, ల్గనుఁగొనమార్తాండమండలం బుదయించెన్. 50

క. ఇటువలె వేఁన నరపతి, పుటభేదనమునఁ బ్రయాణబోధక భేరీ
పటహధ్వను లాకాశ, స్ఫుటనములు నిబ్రలేపి పయనము దెలుపన్. 51

సీ. పటుచక్రగతి నేలపాఁతు పెల్లగిలంగ విమలమణిస్యందనములు దనర
మావటీలకు మింటిదేవత ల్మంత్రాక్షతములీయగజయూథపములు వెలయ
ధారాసమున్నద్ధవళచామరలు ఠెక్కలభంగిఁ దగఁ దురంగములు సెలఁగ
జయలక్ష్మ్లలవరింపఁ జనుపెండ్లికొడుకుల గుంపులై భటరాజకోటియొనర
నడచి తమగపుబైట సన్నాహమెల్ల, నమరఁ బౌజులు దీర్చి నిజాప్తమంత్రి
వరముఖాంతరమున సరివారితోడ, మాటలాడించుకొనుచు సామంతనృపులు. 52

చ. గొనబుపసిండి కీలరిగె గుంపులనీడ వ[illegible]ప నంతలో
జనపతి మేలుకాంచి హరిచందనగంధిలమైనవారిఁ గుం
దనపుమెఱుంగుఁగిండ్ల వసితల్గొని తన్ముఖమజ్జనంబు సం
పొనరఁగఁ దీర్ప నద్దమొకయుగ్మలి పూనఁగ నామతీర్థమై. 53

చ. మినుకుఁ గడానితాయెతుసమేళపుఁ గ్రొవ్విరిదిండుదండడా
ల్పువివలెవాటు చల్వపలిపంపురుమాలువు గట్టి దట్టిఁ జె
క్కినవిడి కెంపువంకి జిగి కెంపగు దుప్పటిదాల్చి యాతఁడే
మనసిజుఁడాయన న్సొగసుమార్గముగాఁ గయిసేసి వేడుకన్. 54

సీ. సమదవేత్రకరాతిసాహోసనాదంబు గడలివచ్చెనటంచు మదికిఁ దెలుపఁ
జామరగ్రాహిణీసరళకంకణరావ మివలి కేతెంచె నంచెఱుక సేయఁ
గమనీయయవనికాకాంచికానిస్వన మల్లన వచ్చెనం చానతీయ
సంగీతవిద్యావిశారదాగానంబు లిదె యరుదెంచెనం చేర్పరింపఁ
జనవరులు లేచి నిల్వ హజారమునకు, నరిగి చౌకట్లముత్యాలయందుహస్త
మిడఁగఁ గొల్చుచు నిలిచి సాహిణులు మ్రొక్క, తెచ్చిముందఱఁ దొలునాఁటి తేజినిల్ప

క. పడిఁగట్టికవారలు హా, వడమిడి హెచ్చరిక రాయవరగండ యనన్
బెడయంకెవన్నెపైఁగా, లిడకపుడు చివుక్కుమనఁగ నెక్కెం దేజిన్. 56

మ. చనవుల్మీఱఁగ మ్రోల నూల్కొలుపు బల్సామ్రాణిధూపంబు వా
సనకు న్వేలుపుముద్దరాండ్రు కచముల్గార్వంగఁ బుణ్యాంగనా
వనజిన్యబ్జకరాపత చ్ఛితమణు ల్వార్ణింప ఛత్రంబుపై
ననువౌ బంగరుగుబ్బ పొద్దఁ దలఁబ్రాలై యుంచఁ జంచద్గతిన్. 57

చ. జనవరమౌళి కొంతవడి సాహిణి నివ్వెఱగంది చూడ జో
డన రవగాలు చూపుచు హుటాహుటి నేగిపరాకు వీరువీ
రని తముఁదెల్ప నంపలు రయంబున వెంబడ వాగె సళ్ళియె

య్యనఁగనుమూసి కన్ దెఱచునంతటిలో మునిసీమఁ జేరఁగన్. 58

క. అరుగఁ దదీయమనస్ఫుర, దరవింద మరందబృందమై మధురసుధా
చిరకంపమై యొకానొక, పరమానందంబు హృదయబంధం బొందన్. 59

సీ. మధ్యసంధ్యాస్నాన మౌనీంద్రలూన తాపసగంధపవనంబు భ్రమరివాటి
నంబుపర్ణసమిత్కుశాయాతపటుజాత సముదనాదంబు మీసంబు దీఁటె
సవన ధూమాబ్దవీక్షణనటత్కేకికాంతావిలాసము తోడపెట్టుకొనియె
నన్యోన్యవైరాసహామృగేంద్రమత్తవేదండ కేళికలు పంతములు వలికె
నీకరణిమున్నుగాఁ బరాకిడియె మౌని, యాశ్రమంబని తన్మార్గమభినుతింప
మోదమునఁ దేలి నృపమౌళి మోము చూడఁ, జనవునైఁ జేరి నిజకేళిసచివుఁడనియె.

సీ. చలువలు నించు నచ్చపుమంచుఁ జిలికించు నీరాయఁ జెడ తేర్పతించువాఁడు
గలభి గాకుండ వేల్పుల నొక్కనొక్కనిఁగా ధనరాజు వెలినుండి యనుపువాఁడు
వారివారిప్రభుత్వతారతమ్యమెఱింగి గిరిశుండు బంతిసాగించువాఁడు
ప్రొద్దువోయెను జూచి భుజియింపుఁడని దేవపతి యుపచారము ల్పలుకువాఁడు
తగినవారల వీక్షించి తమ్ముబోఁటి ఱేఁడు మాటికిఁ జవు లెచ్చరించువాఁడు
జనవరాఖండలా యిందు సంయమీంద్రు కాండకృతమైనసత్త్రయాగంబులందు. 61

చ. మునివనితల్ శచీముఖ తమోనిభవేణులకుం బతివ్రతా
జనతతిఁ దెల్పఁబోఁబరవిచారము గాదని వేల్పుటొజ్జజ
వ్యని మొగమడ్డముంచొనుప వారలు నవ్వుదు రామె సిగ్గుపెం
పునఁ దలవంపఁ జందురుఁడు పొంగగ నిచ్చట యాగవేళలన్. 62

సీ. సాలీఁడు గాఁబోలు సమదవేదండంబు తెలినారచీరలుడులిచి తెచ్చుఁ
బనివాఁడు గాఁబోలుఁ బటుఘోణిపోతంబు బలుమోరనివ్వరి కలుపుదీయు
గొల్లఁడు గాఁబోలు భల్లూకపాకంబు మేలిజన్నపుఁబసిమేఁపి తెచ్చుఁ
జనపరి గాఁబోలు గొనబుఁబ్రాయపుజింక యలరిపై పారుపత్యంబు జేయుఁ
గూలిగొను నొజ్జకాఁ బోలుఁ గొదమ చిలుక, తపసిబుడుతలగమికి వేదంబునుడువు
సుసరముగఁ, బారికాంక్షు లేజోలిలేక, జపతపంబులు సాగింప జనవరేణ్య. 63

చ. మునివరులేగ వెంట మృగము ల్చదికిం జని యంతనంత మే
పున కటు నిల్చిచు న్నియమపూర్ణత వారు నిజాశ్రమాళికిం
జనినఁ దదార్ద్రబంధుర విశాలజటల్ చరజీరు కాడ వె
న్కొని చెవి బక్కరించి యుఱుకుం బొడకట్టినవెల్ల దాఁటుచున్. 64

ఉ. ఎండఁదినంబులం బడఁగ లించుక నీడఁగఁ బట్టి మానులం
గొండొక సేదదేర్చు ఫణికోటులఁ జేరి యిదేటికార్య మా
ఖండలు మహీమి మే మిచట లేమె యటంచు మరల్చి చెల్వమై
నింప మయూరిక ల్చికిలినిద్దపుటెక్కులు వీచు నక్కడన్. 65

మహాస్రగ్ధర. జవవన్మౌనీంద్రవేదాక్షరయుత తతహస్తస్రువాజ్యాహుతిప్రో
ద్భవవహ్నిస్ఫారకీలాప్రక[illegible]తకరదీపప్రభ న్వత్తు రౌరా
హవిరగ్రాహ్యాహూతు లింద్రాద్యమరు లవనికై యాస ప్రేరేపఁగా మిం
దివపాంచద్భ్రమధూమస్థితులు నిబిడమై దృష్టి చీఁకట్లు గప్పన్. 66

క. వెలిమియగ్గి పొగల్దగు, వేలుపుడిగ్గి యమునంగ వెలువడు నమరీ
జాలము తిన్నని ఫేన్నెఱి, వాలుఁగురుల కగరుధూపవైఖరి యగుచున్. 67

చ. ఇనహరిణాంకరశ్మి కెడమీయని యవ్వనిఁ బంకజాకరం
బునఁ గనఁజక్కవ ల్వగవఁ బ్రొద్దులు గ్రుంకుట దెల్లనాఱుట
ల్గనమి జలాగవర్తి కులకాంతలమోమును కల్వరాయనిం
గనుఁగొని విచ్చిపోవుటయె గాని వియోగ మెఱుంగఁ దెన్నఁడున్. 68

చ. అని తెలుప న్మహీశుఁ డవుఁగా యని మెచ్చి పటాని తేజిడి
గ్గినతఱి మూఁగి గచ్చు టరిగె త్తెలిపావడ వైచి యచ్చపుం
బని మగఱాతిచెక్కడపుఁ బావలు నిల్పిన వారలం గనుం
గొని యటు నిల్పి యాప్తులొకకొందఱు వెంట నెరాముసంబునన్. 69

క. చని నృపతి గనియె మునిజన, వనితాజనతానితాంతపద్ధితకేళీ
వనపాళీ కుసుమాళీ, జనితాళీనలినఘనము సంయమివనమున్. 70

క. కని పర్ణశాలప్రోలకుఁ, జని యచ్చటివారిచెంత సంయమిపతికిం
దనరాక తెలియఁ జేసి త, దనుమతిచే వేగఁ జని తదంతర సీమన్- 71

సీ. అచ్ఛపంతచ్ఛవి యామస్తకన్యస్తభసితాభఁ జేరికేకసలు గొట్ట
మోఘావిరుచి గండమిలదుమశ్మశ్రుకుక్షియములఁ జప్పట్లు బెఱచి నవ్వ
జడలఁ బల్వినడాలు శాతిరధారాళికాంతులఁ గికురించి కన్ను మ్రాయఁ
బటునఖద్యుతి కరస్ఫటికాక్షమాలికాచ్ఛాయల డాసి కేకేయనంగ
నవ్యశార్దూలచర్మాసనంబుమీఁద, యోగపట్టె బిగించి కూర్చున్నవాని
గాలవుని గాంచి చేనున్న కత్తి మంత్రి, యందికొనఁ జేరి సాష్టాంగమాచరించి- 72

క. నిలిచినఁ గనుఁగొని నరవర, కులపావన యింపుమీఱఁ గూర్చుండుమనా

నిలిపితివి తండ్రిపద్దులు, వెలసితి విటు లతనికన్న విక్రమ గరిమన్- 73

చ. అనుచు బహూకరించుసమయంబున [illegible] యుండి యుండి యం
బునరుచి పుంజమంజిమకచగ్రహ [illegible] పత్రతో
దన హరిచందనప్రతిభటంబగు వెన్నెల దోఁచె [illegible] నే
కనఁబడియె న్నిరస్తకనకస్తబకస్తుతులై [illegible] యెంతయున్- 74

క. అది చూచి మేదినీవర, భిదురో [illegible] గా [illegible] ము గంటే
యిదిసుమ్మ దనుజశాంబరి గదిసె న్వరిపు [illegible] ఖండంపు మిఁకన్- 75

గీ. విజయ మగు నీకు గెలుపు [illegible]
యనుచు గాలవుఁ డాడుచో నచట [illegible]
పారిగాండ్రును కటకటం బడుచు శిష్యు
లంటి చనుదేర నచ్చోటి కరుగుదెంచి- 76

క. మునిచంద్ర వచ్చి మా వెం, ట నెవచ్చి నటంటి వీతఁడా [illegible]పుడేమ
య్యా నరేంద్ర కన్నులారం, గనుఁగొంటివె వీని యవవగాకి తనంబుల్- 77

ఉ. అయ్యయొ మాకు దండమిడినంతిఫలంబు నరేంద్రచంద్ర యీ
దయ్యము తోడి జాగరము దాఁటఁగఁ జేసి శుభమ్ము లిమ్ము తే
వయ్య కౌమాళ్ళతండ్రి వయి యాశ్రితరక్షణ దుష్టశిక్షణా
క్షయ్యదయాపరాక్రమ విశాలుఁడవై మనుమయ్య యిమ్మహిన్- 78

సీ. చదువుకొన్నామంచు జట చెప్పుచుఁ బరీక్షఁగొని వరింపు ఘటించుఁ బెనఁగువారు
ననుజూచె ననుజూచె ననుచు రిత్తకురిత్త జడలు వట్టుక పోరఁ దొడఁగువారు
బులకము ల్మైనిట్టపొడువంగ వడి నోరుదెఱచి మైమైఁ జూడఁ దిరుగువారు
జేసన్న నటజంబు చెంతకు రమ్మని మును ద్రొంగ మొక్కులు మొక్కువారు
నగుదు రీయయ్యలెల్ల వాఁ డపరుగడగ, గులుకుగుబ్బలు దళుకుఁ జెక్కులు మిటారి
మొలకనవ్వులు గలమోము ముద్దుగులుక, మాయపుం డెక్కులాడియై డాయునపుడు-

సీ. అటుమొన్న భార్గవజటికి శౌనకమౌని కొకవాదుమై నొంటకుండఁ జేసె
మొన్నఁ బారాశర్యముని యోటరాఁ గూఁతలెగయించి వెరవేఁకి యెత్తఁ జేసె
నిన్న విశ్వామిత్రునికిఁ దందరఘటించి యొడలెఱుంగక పడియుండఁ జేసె
నేఁడు మార్కండేయునికి నివంబెత్తించి తలవీడఁగ బయళ్ళ మెలఁగఁ జేసె
మానవాధీశ విను మింతమాత్రమైన బ్రతుకవచ్చును వీనచేఁ బడినవాళ్ళ
కొల్లఁబాటయ్యె మాకునిందునికి యేమి, చెప్పెడిది మాతపంబు నీచేతి దింక- 80

చ. అన విని యంతయేమిటికి నానతి యిచ్చెద రిన్నినాళ్ళుఁ ద
ద్దనుజుని నొంచి మీపద ముదారముదాకృతి నొందఁ జేయఁగం
డినయది నాకు నేర మవునేకద యాకొదవ ల్సహించిన
న్ననుపుఁడు వానిఁబట్టి నుఱుమాడెద నొద్దికఁ జెల్లఁజేసెదన్- 81

చ. అనిన రిపుక్షయోస్తు విజయోస్తు పతేభవతే యటంచు వా
రనుపదురాపకోప తరుణార్క విభాపలితారుణాంబుజా
బనఁగను మోము కెంపుగఁ దదర్థరణోన్ముఖభృంగయుగ్మప
క్ష్మనటనభ్రూకుటిక్రమము దెల్పఁగ నవ్వెటుఁ దర్లి నిల్చినన్- 82

సీ. అధిపభృత్య పరస్పరాన్వేషణాకారణప్రతివక్త్రతన్నామకార్య
మననుగతస్వామి రాయవేగభూరుహచ్ఛాయాసమాశ్రితచ్ఛాత్రకంబు
ధావనాయాసాస్వజీవనవృత్తిధిగ్వాచకాందోలికావహజనంబు
సమ్మర్ద్దబహుళాది సరణిక్షోభయుపార్శ్వచారితవారణాధోరణంబు
సరయ సరదుష్టనిష్ప్రతజర్జరతధూర్త, గణ్యాగాణిక్యసంభవత్క్షమనహాస్య
వారణక్షమతత్సుతాక్రూరదృష్టి, సంవృతాశంబు సైన్య మచ్చటికి వచ్చె- 83

క. ఈరీతి సైన్యమంతయుఁ, జేరిన నొకబయట రాజసింహము భటులం
దేరిజ వేయంబనిచి గు, డారము లెత్తించి యంతట ప్రవిగుంకన్- 84

గీ. పఱపుటంగడి వీథులేర్పఱచి కొంచె, పాటి నడగని నెక్కి యాపాలె మెల్ల
విడియ నియమించి తిరిగ వేవేలు దివ్వ, టీలవెలుఁగున సంగీతమేలమమర- 85

చ. తిరిగి యతండు వచ్చి వడఁదేర్పుచు ఘుమ్మను వట్టివేళ్ళ చ
ప్పరము కురంగటందగు తుపారము చేరువఁ జారువజ్రపాం
డరరుచిగ్రమ్ము గుమ్మెతగుడారమునం గొలువుండి పట్టనాం
తరముననుండి వచ్చునరనాథులకమ్మలు వించు నున్నెడన్- 86

గీ. ఊడిగపుటత్తికాఁ డొక్కఁ డొఱఁగుఁ జేరి
విభుని చెవిలోన నేమేమొ విన్నవింప
నతని కనుసన్న గనుఁగొని యయ్య మంచి
దతనిఁ బిలిపించెద నటంచు నఱిగివాఁడు. 87

సీ. సేనకై సగము దీసిన బూదిపంటుతోఁ గూడినబంగారు లాడె సింగి
బారసీలిపిని జొప్పడ భగవద్గీత లెన్నికవ్రాసిన చిన్నిపలక
బుడుత పసిమిరుచి పులితోలు చుట్టుతో బవనిక ల్పించిన పట్టుజోలె

యొకతిత్తి బరదేశుల కొసంగఁ గూర్చిన రసవాదపు మెఱుంగుఁ బసిఁడి బుడ్లు
కొండవలె నెత్తిపైఁ జుట్టుకొన్న జడలు, వెండికట్టులబెత్తంబు విడెమువీఁద
వీడియముగల్గుదొర పాతలాఁడెజోగి, బిలికొని వచ్చి పొడఁగనిపించుటయును.

గీ. పతికరముఁజూప రత్నకంబళము మీఁదఁ, గడవసము వైచి కూర్చుండి బుడుతకీచు
సురటిగాడ్పుల నుదుటి కస్తూరి బొట్టు, రవలు రాలంగ నాతఁడా రాజుఁజూచి-

సీ. ఇది చేత నుండిన నిసుమంతవడిలోన నేదేశమునకైన నేగవచ్చు
నిది మోళి పైనున్న నెదుటి చే వెళ్ళిన వైరికైదువజాతి దారితప్పు
నిది దట్టిపొఁబి నున్న నెటువంటిరూపైనఁ బాఁపించి వేడుకఁ జూపవచ్చు

* * * * *

* * * * *

* * బవనికలొసంగి యొకమాయ పన్నుటయును.

ఉ. కంటెఁ దగిల్చిచుట్టికొన గల్గిన చందురుఁగావి జాళువా
జంట వయంటపై నిగుడి చక్కని జక్కవ నిక్క చొక్కపుం
జంట చెలంగు బంగరువు చాయలు దూచియనంగఁ జాలు వా
ల్గంటి మెఱుంగుఁ జూపులు దళారనవచ్చె మహాద్భుతంబుగన్- 91

ఉ. చొక్కపుఁ బంజుకమ్మల రుచుల్మెఱుఁ గెక్కిన చెక్కుజాలువా
నక్కలచక్కజక్కిణిగొనం బిగిగుబ్బలు పిక్కటిల్లఁగాఁ
జుక్కలరాచడాలు తెలిచూపులు త్రొక్కనిచోట్లు ద్రిక్కనా
చక్కెరబొమ్మయమ్మహిపచంద్రుని చక్కటికేగి గ్రక్కునన్- 92

ఉ. రంగు చెలంగ గుబ్బల ధరాస్థలివత్తము మోపలేమిసా
ష్టాంగ మొనర్ప సిగ్గునడె నంచు నభంగురపాకభిన్మణీ
సంగతకంకణారవముచాటఁగఁ బైటచెఱంగు కేలితో
ముంగలఁ గొంకుచుం గొలువు మొక్కఘటించి పిఱింది కేగినన్- 93

సీ. సయిదోడ చూడు నస్సాయ యిల్లేజ యిల్లేశవోజులపతి యింగిలయ్యా
* జగ్గుమంటిమి వచ్చిశాణ నిద్దాహుంత్త కారి బుర్సాపుత్త గాలిసుమ్మ
అట్టెచూస్తుండది యదెన్నె మోసిలి గలవాఁడ నని యదిగాక గడిని
చిక్కారిసాదన జేసెనదియున్న దోభాజలల్ల మెలుద్రిబజారి

---

* యీపద్యమును బ్రత్యంతరములేకపోవుటచే నిచ్చవచ్చినట్లు దిద్దినఁగవిహృదయము చెడునని భీతిచే నాభారముఁ జదువరులకే వదలినాము.

దీనిపైయేడుపై సేసి నానువాని, చిక్కుటారికోలారికచిస్త్రిరోలి
రాజుపాలానవిను యిటురాయటంచు, రాచదేవళ్ళు కెదలి విరాళిగొనిరి. 94

గీ. అంత వారెల్లఁ దత్కారణాభినూత, నాతివాచాటతాజ్వప్రభూతరోష
వీతిహోత్రసముజ్జాతధూతికీలి, కాత్రశుతిస్ఫీతతామ్రాత్ములగుచు లేచి- 95

సీ. ఒజ్జలతోడుత దట్టిపొరల నంకులు దుస్సి తెలిచల్లడములతో నిలుచువారు
నింటి కిమ్మని పిల్లబంటుచేతికి సొమ్ము లొసఁగి వీరావేశమొందువారు
జానన్నఁ జేవెళ్ళ మని హెచ్చరించుచుఁ జికటారి పొదలికి ల్సేయువారు
దీని మొంపరనొంచి వానిపైఁబడువారు * * *
వాలు గొని లేచివచ్చు భూపాలుఁ ద్రోచి
యవ్వలి గుడారమున కేగుఁడనుచుఁ జెనకి
యతనిగద్దింపులకు భయమందువారు
నగుచు నంపఱు దొమ్మిగా నరయుటయును. 96

గీ. అంత నాలాడెజోగి మాయావిధిజ్ఞ, పంచమంతయు నుపసంహరించి నిలిచి
మునుపుఁ గొలువున్నవేళ నేయునికినుండి, రట్లయుండఁగఁ గైవార మాచరించి- 97

క. పాతాళకేతుఁ డంపిన, దూతన్నాస్వామికెదిరి దరమున నిలువ
న్నీతరముగాదు వినుమీ, వేలెంచి బలంబుతోడ నిటు విడియుటయున్- 98

మ. తనచారుల్గని వచ్చి దైన్యమున నేతద్వార్త విన్పింపఁగా
విని మీసంబులుద్దిద్ది దైత్యుఁ డహహా వీరా పడిన్వచ్చిపో
రనునన్నుం గది యించువారు మజీవారా నన్ను మార్కొంపురం
చనుమానింపకవచ్చి నిల్వఁగల వీరాగ్రేసరు ల్బాపురే! 99

క. పెంపు విచారింపక విని, పింపఁగ్రాదనక వచ్చి ప్రేలెడు వీరిం
జెంపలు వేయరె యనుచు ని, లింపారి నిజాప్తులం బిలిచి యిట్లనియెన్- 100

ఉ. వింటిరె యొక్కవార్త మనవెట్టులు చెప్పిరి తాముకన్నులం
గంటి మటంచు నీతబిసిగాంద్రు మదీయమహోగ్రమాయకై
దంటతనంబునంజని ఋతధ్వజు సైన్యసమేతుఁ డేర నా
బంటుఁ దనంబుఁ బాపుటకుఁ బన్నినవాఁ డటవాఁడు వాఁడిమిన్- 101

సీ. గరళకంఠద్వేషి కరకకాయలు గొన్ని తినియైన నాఁకలి దెచ్చుకొనుము
దేవేంద్రమదభేది తెలిచాయ గలకోర పంటిమొన ల్సానఁ బట్టుకొమ్ము

ధూమ్రపుబర్బరకేశ తుప్పవట్టినఘోరజిహ్వ మిక్కిలివాఁడి చేసికొమ్మ
కుటిలాక్ష మాంసంబు గొంతునఁ బడినోరు దెఱవ విప్పుడు సిగ్గు దెచ్చుకొమ్మ
తడవులకుఁ గగ్గె మనుజయూథప్రచండ, పలలపారణ తద్రక్తపానకేళి
లాలసామోద మీసుమాళంబు మీఁద, నరుసనంపఱు గంతులు వైపుఁ డింక 102

క. అని నన్నుఁ బనుప వచ్చితి, మనుజేశ్వర బాయు వెట్టుమా రాజుల ని
న్వాని తూర్పుదెసకు మాదొర, చను దెంచు న్యాక్కవహాన సన్నాహనమునన్- 104

గీ. అనినఁ జెఱునవ్వు నవ్వి యజ్ఞనవరాగ్ర, గణ్యుఁ డతనికిఁ గట్టునర్గం బొసంగి
మంచి పటువలెనే నడిపించుకొంచ, మంచు వీడ్కొల్ప నాదైత్యుఁ డరుగుటయును-

గీ. అధిపతియుఁ జబ్బలుధరించి యారగించి, హితజనులు గొల్వఁ దగువారి యిండ్లకెల్ల
గేలిగతి నేగి యిది వేళ కీలిఁజామాట, వాసులకటంచు లాలించి వచ్చెనంత- 105

సీ. బొంగులు నిల్పియుబ్బఁగఁ బైఁడిబ్రాంత బొమ్మలగుడారంబు లమర్చువారుఁ
గొయ్యలు నాఁటి యాకులతోడి రెమ్మలు వాటంపు గుడిసెలు నైచువారుఁ
బొక్కళ్ళవలెఁ గుంతములు చేర్చి యామీఁద గడితంపుఁ బచ్చడాల్గప్పువారుఁ
బచ్చికల్చెక్కడుపాఱలఁ జెక్కి పూబొదరిండ్ల మున్నుగాఁ గదియువారు
నచ్చటఁగ నీటికందువలరయువారుఁ, పురుఁగుఁబుట్టలు చెదర నుబ్బుచునొక్క
పరిగ నవ్వుచుఁ జప్పట్లు చఱచువారు, నైరి తద్వేళఁ బాళెంబువారలెల్ల- 107

సీ. రాతిరి పొక్కళ్ళ రాలుకొల్పిన వహ్నిగలిగినపొగలు చీఁకట్లు గప్పె
గాడ్పులచే నూఁదకయ బగ్గుమను శిఖల్నిగుడుచోటులు పట్టపగలు చేసెఁ
దగవార్చి మూతుళ్ళ దిగువాఱనుంచిన కూటిబల్తావులాగుబ్బకొనియెఁ
బొరలించి చంద్రపనిప్పులమీఁదఁ గాల్చిన కఱకుటల్లవాసనల్గ్రమ్ముకొనియెఁ
ద్రోవదిబోసీక బల్లెముల్ బువ్వి తెచ్చి, కడిగి జింకలవ్రేలాడఁ గట్టి తిత్తు
లొలుచు భీభత్సరసము మహోగ్రమయ్యెఁ; భుక్తి గొన్నట్టివారి త్రేఁపులుఁ బొసంగ-

క. చాలఁ గురంగటిమడుగుల, గాలాపున్వోఁటలాడఁగా దొరకినబ
ల్కీలు నవిఁ దేల్చె నపుడా, పాలెంబున డిగిన బక్కబంట్రౌతులకున్- 108

సీ. వలసినద్యూతముఁ గమ్మలుబ్రాయు ప్రాయసంబులవారి గంటాల కిలకిలలును
దొరపలంపిన కార్యసరణు లెంచు నమాత్యకుంజరంబు లొనర్చు గుసగుసలును
బొలదిండి రాయల యలవులఁ గనివచ్చి సలుచు వేగులవారి కలకలములు
సరస కింపఱటించు వంతు లేర్పడియున్న బలకథంబులవారి యబలములు
సెప్పుడు వేసాలు నొకపోయుంచు నెంచి యాడెఁ

జూచు సంగీతమేళంబు సొగసుకాండ్రి
ధిమ్మనెడి మద్దెలలమ్రోత గ్రమ్ముకొనియె
రాజు పవళించు తెలిగుడారంబుమ్రోల- 109

చ. నలుఁగిడి చల్వదాల్చి పయనంపు టలంతల నిద్రఁ జెందరో
వెలఁదులలేపఁ గొంకి పతివింతగుడారపు పారివారిగం
టలరొద కుల్కి లేవఁ జిఱునవ్వులతోఁ దమవారిఁ గూడి యిం
పులతమి దీఱినన్ నిదురవోయిరి నన్నృపభోజాంగు లత్తఱిన్- 110

చ. గుమిగొని తెచ్చికోలుకుసిగుంపుల దెబ్బలనీఁ బొట్టిమం
చములపయి న్శయించి పటసారకుటీరము లెత్తి వేలిజా
నమున రమించు పల్లవులనంటున నేరము లెన్నుచున్నృప
ప్రమదల మ్రోల నీటునెఱపం బనిపూనిరి గుత్తలంజియల్. 111

చ. కనుకని తెల్లవాఱుచనుక న్వతిగోరెడు పల్లవాళి మే
ల్గనుఁగొని వీడెముంగలుపులాహిరి మేపుల నిద్రఁబుచ్చి చెం
దిన చిఱునవ్వుతో నపుడె నిద్దురలాయని వింతపైఁడి ప
ట్టిన వెలముద్దుగుమ్మలు వడిన్శయనించిరి చప్పరంబులన్. 112

క. అల పాళెమునకు నిలుపని, బలకరమై పారివారిపరియై తగును
క్కళమై నిదురించని సరి వలపుల వెలచెలుల విటుల వతిఁలు టమరెన్. 113

సీ. ఒక్కండు పట్టుగా నూఁకొనఁ దబ్బిబ్బుబాటు గొల్లసివాలు పాడుకొనుచుఁ
బాముసాడించునేర్పాటునఁ దలయూఁచికొంచును జెంగు విన్పించుకొనుచుఁ
దమవారి గుమిగూడి దమ్మరాజులకత లొన్నటికడ్డములేక నొడివికొనుచు
లయయొక్కతో వతాళంబొక్కతోవఁగా నేమేమొ ఢక్కవాయించుకొనుచుఁ
జిటుకుమన్నఁ బరామరిశించుకొనుచు, నంటుకత్తెలు తమపయనంబు సమ్మ
తించకాడిన వగఁ జెప్పుకొంచుమించి, రుక్కళపునల్లమందుల యొంటికాండ్రు. 114

సీ. ఫెళపకుమని వెన్ను చఱచి వేలుపుఱేఁడు తెలిపిననింద్రాణి తెలియ వయ్యెఁ
దనుతానె తెలిసి మూసినకంటితోవాణి వీనులపైఁ గేలు మానదయ్యె
నది పరామరిశింతునని యేగు పతినాఁగి జలధినందనకొంగు విడువదయ్యె
దడదడమన గుండె తాళిబొట్టుదర గుబ్బలిపట్టి పడఁకయిల్వెళలదయ్యె
బాళెమున నక్కడక్కడఁ బదిలమునకు, మ్రోయఁజేసినతముకుల మొదలిపోటు
దారమ్రోతల పటహంపుధణధణలకు చొంతిగా సంద్లనిటులున్న యంతలోన. 115

క. అలరాజు విజయ మెనయం, గలఁడని చంద్రుఁడును దారకావనితలతోఁ
గలహించి ముడియవైచిన, పొలుపలరన్ వేగుఁజుక్క పొడిచెం బెడఁగై 116

క. అంతట దనుజేంద్రుం డొక, దంతపుఁజవికెన్బ్రధాన దైత్యులతోడ
న్మంతనమాడుచు నృపుబల, వంతపునైఖరులు వేగువారలు దెల్పన్ 117

క. పడవాళ్లఁ బిలిచి బలముల, వెడలింపుఁ డటన్న వారు వెసఁ జని నిద్రా
జడులను బలాళి వీరుల, వడిగా మేల్కొల్పి ప్రకృతవార్తలు దెల్పన్ 118



చ. అదరుచు వచ్చె నొక్కపలలాశి నిజాంగన సిగ్గుతోడి న
వ్వొదవెడు చూడ్కి చేతఁ దనయుల్లములోని పునారతక్రియా
భ్యుదయపు వాంఛ దెల్పఁ గనుబొమ్మ నదల్చుచు మీఁదివేలుపు
న్మదితల నంటు గానిపయి ముందుగఁ జొకఘుటించె నోయనన్ 119



చ. ఒక దనుజాధినాథుఁడు [illegible] గంధములందికొంచు గొం
చక చనుదెంచె [illegible] రాజమార్గణా
ళికి నిఁక మీఁద [illegible] యిర[illegible] బొమ్మగోడపైఁ
జికిలియొసంగి [illegible] యలఁ [illegible] పాయుకైవడిన్ 120

గీ. విరులు సిగఁ జుట్టికొని యొక్క [illegible], దరిగ నిఁక మీఁద [illegible] నిజ
పుష్పముల సారసౌరభంబునకు వాని [illegible] పునకుఁ బూని సరిచూడ [illegible] యుననఁగ 121

క. ఈ నేలచుట్టుఁ దిరిగినఁ, బో నీయఁడు రాజు పాఱిపోరాదనుతీ
రూనఁగ నొకనక్తంచర సూనుఁడు చక్రింబు ద్రిప్పుచుం జనుదెంచెన్ 122

క. అనలోపమనృపశరముల, మొనలంబడి తరణిబింబముం జొచ్చుగతిం
దనుజుం డొక్కఁడు గ్రక్కునఁ, గనకరథంబెక్కి యుక్కు గ్రిక్కుచు వెడలెన్.

సీ. పడవాళ్లగమికిఁ జేపుడికి దబ్బఱనొప్పి పైవైచుకొని మూలఁబడినవారు
నిండ్ల లోననయుండి యెటువోయిరో కాన మనిపించి కనిపించకడఁగువారు
నింటికావలికి నచ్చిచట నిల్పరు గదా యని వేల్పులకు మ్రొక్కఁ జనెడువారుఁ
దొలునాఁడె నృపువార్తలు విని యొక లేనిపనిఁ బూని యెందెందొ చనెడువారు
గ్రాసముల్లు చెల్లలేదని గాసిచేసి, కొలువుజీవితముల కొప్పుకొననివారు,
నగుచుఁ గోఁచపిశాచము ల్దిగులుపడఁగఁ, దక్కురక్కసిదొరలు ముందఱను నిల్వ

సీ. నిలుచుండి వీణ చేతులఁబూని తెఱఁగంటిబయకాఁడు మేల్కొల్పు పదముఁ బాడ
నలుకతో నాల్గుమోములదేవుఁ డొకయోర దినశుద్ధి దెల్పి వేవెనుక కొఁదుఁగఁ
వనయూరినుండి తెచ్చినపూలమాల జేజేలరాయఁడు చేరి చేతికొసఁగఁ

జోరవచేసికొనిశంకరుఁ డిచ్చుకాలకు సఖుఁ డౌకుబేరు పైఁ జూడిచెప్ప
గడియయుడుక మునుంగుటఁ గని గురుండు, తెల్లవాఱెడునని పఱతెంచి పలుకఁ
గటికివారెల్ల దొరలువచ్చుట వచింప, దనుజపతిలేచి యొకభద్రదంతినెక్కి 125

గీ. కోటకావలికై యాప్త కోటితోన, నీవు నీవని నియమించి నిలిపి తక్క
రక్కసులు వారణంబుల రథములందుఁ, దురగములయందుఁ బొడసూపి తోడనడువ

సీ. చెకుముకి యగ్గిజానకి త్రాటిమిడుఁగుఱుల్గ్రాలెడునది యెలగోలుమూఁక
వెదురుమల క్రొచ్చు విధమున నీటియద్దాల్చిపాల్చి యది దండిబారు
లిరుగోపులను దుమ్ము లెగయించునదిసిలేముస్తీబుగల కాలుమొకరిపౌజు
కొమ్ముకత్తుల మెఱుంగుల వెల్లపావడ గ్రాలునది మస్తేనుఁగులచయంబు
సురగిరీంద్రంబుపిల్లలై చుట్టు నున్న, కనకరథముల నడుమ సింగాణి విల్లు
దొనలు మెఱయంగఁ దేజిపైఁ దోఁచువాఁడు, ధారుణీశ్వరుఁ డని వేగువారు దెలుప

చ. అరిగి మహాభయంకరతరాహవదోహలబాహవప్రతా
పరుచులు వోలు చెందిరపుఁ బావడచేఁ బుఱచేయి వీసిసు
స్థిరమతి నంపపెట్టుకోలఁదిం గజరాజము నిల్పి దానవే
శ్వరుఁ డెలగోలా నర్పఁగ నిశాచరుల న్నియమించి నంతటన్. 128

చ. అలరు మొగంబుతోఁ గువలయాశ్వము నిల్పి నరేంద్రమౌళి తూ
పులపాదిదోయి వీఁపుకడఁ బొందుపడం బిగియించి మించురా
చిలుకలప్రాఁతగచ్చుపని సింగిణి గైకొని యెక్కువెట్టి సే
నలు తనసన్న గోరఁగ గుణధ్వనిచేయుచుఁ జేయి వీచుచున్. 129

క. పేరెములువాఱి యొక్కక, చేరువ గుంపగుచుఁ దారసిలి యిరువాగుం
ఘోరపుబాణపుఁ జువ్వలు, భోరనఁ గొనవిఱిచి వైవఁ బొసఁగ న్మోపటన్. 130

క. కొనద్రుంచివైచు బాణపుఁ, బెనుజువ్వలు పాఱి నేలపెట్టుగఁ బడుఁజీ
బున సిగిడి కాలుసేతులు, దుసియలుగావించి ముందు దుఱుసున నడిచెన్. 131

క. ఉయ్యాలచేరులనఁగా, నయ్యిరువాగులును దఱిమి యాటు దిరుగుచు బ
ల్కయ్య మొనరించుచుయించుక, డయ్యక యొడ్డపయిఁ బెట్టుటయు న్నట్టియెడన్.

చ. ఒకపరి యొడ్డలోని రిపులుగ్రతనైచు తుపాకిమందు గుం
డ్లకు వెనుదీయకాఁగి యచటంబడు నాఫ్రులఁ గోలుగొట్టినీ
య కనిఁ బెనంగి యంతఁ దరియం బడి యచ్చటివారలం గకా
వికలుగఁ దోలి యొడ్లు విడిపించిరి చేరువకాండ్రు మెచ్చఁగన్. 133

గీ. అలసినట్టి జనులు తేలి యవలికరుగ, వేఁటుతుటుములు పెనుబోటు భేరిమ్రోఁత
లమర నరుదెంచి దొడ్డకయ్యమున నవియుఁ, బడలనంతయుఁగని దండిబార్పుగదిసె.

క. అంపఱునిట్టులు వచ్చిన, యంపము గనుపట్టెఁ దద్రణాంభోనిధి దాఁ
టం దెప్ప గట్టఁ బూనిన, చందంబున నలుగు ల[illegible]యల నీనన్. 135

గీ. ఒకఁడు కుంతానఁ బగవాని యురము గ్రుమ్మ[illegible]
వెంట నేయాతఁ డీటెచే వెళ్ళఁ బొడువ [illegible]
వెలసె సద్దఱు నిల్చిన నిలుపు కదన [illegible]
కాళికై కానడించిన కానుకనఁగ. 136

క. పగవాని గ్రుచ్చి యీటెని, నెగనెత్తెనొకండు రణమహీంద్రుమాలమునం
గగనమునుండి వ్రాలెడు, ఖగపాళుల కంది యిచ్చు కైవడి మెఱయన్. 137

క. జముదాడి నొక్కవీరుఁడు, విమతేంద్రుం బొడిచి వాఁడు వెస నిజభుజసా
రము మెచ్చి చల్లునవకుం, కుమబలెఁ దద్రక్తమున నిగుంభితుఁ డయ్యెన్. 138

క. అలుగువగ చూపువేళం, దలతలమను నింతసోఁకిన న్మృగవానిం
గళదాఁకెఁ బెనఁగు నొకమొ, క్కలపుద్ధోరకరాసి నీటుకత్తియ యగుటన్. 139

చ. నిగళము లూడ్వనెత్తి కరిణీపతిచేరిన్ దేజిపావడన్
మొగమునఁ గప్పినూకి యొక మొక్కలపు న్నెఱరౌతు కుంభము
ల్పగులఁగ నేసిన న్వెడలెఁ బట్టము వెంటనే మౌక్తికావళు
ల్మగఁటిమి మెచ్చి చేరి జయలక్ష్మి సుమాంజలి యిచ్చు కైవడిన్. 140

మ. బలియుం డొక్కపటానిరౌతు తనబాబానూకుచు న్నెండువీ
థులమాస్ట్రీలతలల్కరాసిలతికం దుండించుచుం జుట్టిరా
నలకెం దత్తనువు ల్లరంబడుట భూతాజ్ఞప్తిచే వెట్టిమో
పులు నేలం బడవైచి కూలఁబడు కాపుల్వోలె నప్పట్టునన్. 141

క. నరపతి యంతట దనుజుల, యురువడిఁ గని చేయివీవ నుగ్రాకార
స్థిరతం గరులకుఁ గరులున్, హరులకు హరులరదములకు నరదము లెదురన్.

సీ. రాజ నా చెయిచూడు గ్రాసంబు ఋణముగాఁ జేయుదునే యంచుఁ జేరువారు
లలితంపుఁ దులసి ప్రోగులు ద్రుంచి నోటిలో నైచి కొంచుఁ దురీనవచ్చువారుఁ
గలనిలోఁ బోలియుటకంటె భాగ్యమ్ములున్నవె యంచుఁ దెగి యనికఱుమువారు
నేలినవానికట్టెదుటనే పనికివచ్చుట గదా మేలని చొచ్చువారుఁ
బూర్వవైరంబు మాని సొంపులు జనింప

నొకని కొకఁ డెచ్చరించుచుఁ జికిలియొఱలు
పొఱవైచుచు వడిఁజొరఁబాఱువారు
నగుచుఁ గైజీతములవార లనికి నిగిడి. 143

క, దనుజులఁ గదిసిన నత్తఱి, జనితంబగు ధూళిపాళి చదలఁ బొదలఁగా
ననిమిషకోటికిఁ గరములఁ, గనుదోయిం బులుముకొనుచుఁ గనుఁగొనవలసెన్.

సీ. అరదము ల్దురదుర నరుదార నరుదేఱ నరదము ల్దురదురనరిగె నెదురు
కరులు ఘీంకారబంధురములై నడతేఱఁ గరులు ఘీంకారబంధురత నెదురు
హరులు హేషాతిభీకరములై పఱతేఱ హరులు హేషాతిభీకరత నెదురు
భటకోటి చటులతోద్భటములై చనుదేఱ భటకోటిచటులతోద్భటత మీఱు
సారథులు వ్రాలఁ గొమ్మలు చదిసి కూలఁ, బక్కెఱలు వ్రీలఁ గళవాలపటలి తూలఁ
గేడివారంగ నవి పోరు ఖేచరాళి, హర్షమునఁ జూడఁగా బొమ్మలాడినట్లు. 145

మ. చదిసెం దేరులు పాఱె వారణము లశ్వమ్ముల్ధరం గూలెఁ గం
ఱెదరెన్ సైన్యము వ్రాలె బాహువులు ద్రెస్సెన్ మాంసము వ్రాలెనం
గదము ల్దీలెఁ గిరీటము ల్పఱచె రక్తశ్రేణి కయ్యంపుఁ జో
కుఱ్ఱదనర్పన్ భుజదర్పమొప్ప నిరువాగుం జేరి పోరాడఁగన్. 146

సీ. ప్రేగులుమీఁదఁ గప్పించి నవ్వెడు తలల్తూఁడులుగల తమ్మితుటుముఁ దెగడెఁ
గెంపుటుంగరపుడాగ్లీల్గొన్న బాహువు ల్ఫణిమణు ల్గలయహిప్రభులఁ దెగడెఁ
బలు జముదాడిపోటుల్ప్రమించు వక్షము ల్నెఱియ లానిన భూమినీటుఁ దెగడెఁ
వ్రేటులరక్తము ల్వెడలించుతొడలు కుంకుమనీటి చిమ్మనగ్రోవిఁ దెగడె
దనుజమనుజేంద్రసైన్యముల్ దైన్యమెడలి
కయ్యమొనరింప సంగరాంగణము చూచు
దివిజవర్యులు మొగములు ద్రిప్పికొనఁగ
నప్పు డమ్మక్కు యనిపించె నమృతముగను. 147

వ. వెండియు నుద్దండతరదండధరకోపాటోప విభ్రమభ్రమిత నయనభ్రమావహస్యంద
నసహస్రసంగతరథాంగనికరావభ్రవిభ్రమణ విధూత ధూళీపాళికా ధరాధురావ
హ గిరీశదరీణకరీశ్వరంబును గరీశ్వర ధారాధరక్షతజపూరపారావార దుర్వారత
రంగాయమాన కనకపరికరంబును బోరనెడఁదగాయంబులవారలం గుంతసంఘ
టితద్విషేటికాడోలికలం గొనిపోవువారును మున్నఱకమై నెక్కినకత్తలాణంబు
లం బరులపాలు చేయ నోపక డిగ నుఱికి కటారుల డొక్కలు విదారించి

నడచి పడువారును క్షతంబుల వెడలు ప్రేవుల నూడనీక యదిమి కదనోన్మాదం
బున దుస్పటులు బిగియించి యెదిరించువారును గెలుపుగాయంబులఁ బడియుం
డియు మండిగాలిడుకొని కైదువులు జడిపించుకొనుచు రౌద్రాకారంబున ను
న్నవారును గళదెలిసి నలుదిక్కులుం బులుకుపులుకునఁ జూచి మానధనంబునం
దొడిగినచల్లడంబు లక్కడక్కడఁ జించుకొనువారును ప్రాణనిర్యాణసమయంబు
నందును నిజస్వామివిజయంబె విచారించువారును నడుగక మున్న యభ్యర్ణంపుమడుఁ
గుల జలంబు దెచ్చి దప్పినివారించు బంటుల ఋణంబులు దీర్చుకొని వారితో నా
త్మీయులకు వలయు బుద్ధులుపదేశించువారును దెట్టువలుగట్టియున్న క్రొన్నె
త్తురులు గనుంగొని నెత్తురుకళవట్టి తమకుఁదాము ప్రాలువారును దొలఁగక
క్కడక్క ష్ఠభద్రపఱచిన ముదురుమానిసులకతంబునఁ బోఁగూడక నమోనమో
యనుచున్నవారును గ్రించుఁదనంబునఁ గొంచెపాటిచెనకులఁ దెచ్చికొలువేదన
లంబడి తన్నుకొనువారును గలిగి సంగ్రామంబు గావున నధికధామంబును జన్యం
బు గావున భూతక్రియామాన్యంమును సమరతలంబు గావున ధమోజ్జ్వలంబు
ను నై యాసమీకంబు సమాకులితనాకలోకం బయ్యె మఱియు. 148

గీ. పోరఁ బెనువానగా రక్తపూరమొలుకు, కాయములు పూను భూతనికాయమలరెఁ
గేళిగతి నిల్చి రణభద్రకాళిమ్రోల, వరలు పన్నీరుతిత్తులవా రనంగ. 149

సీ. గ్రుడ్డులు మిడికించుకొని దప్పికిమ్మను దమవారినొక్క బేతాళవాళి
గ్రొంతుమ్రోచిన దిగుల్కాని నోర వ్రేలిడి క్రక్కునొక్కపిశాచికావిభుండు
అన్నువట్టినను మ్రాగన్నుతోఁ బొర్లాడు నేలపైనొక్క డాకినీవరుండు
కక్కుర్తి మెక్కి యగస్త్యమంత్రమువల్కు బొడ్డు నంటుచు నొక్కభూతనేత
తనివితీఱిన త్రేఁపు విన్ననకుసిక్క, శతపదాల్ దొర్కు నొక్కనిశాచరుండు
పలలరాసుల బువ్వంపుబంతివిందు, మించుబోఁడులతో నారగించువేళ. 150

గీ. ఒక్కనికళేబరమరసియుఁ దగఁదినక, వీనిఁబడవైచె నాతఁ డావీరుఁ డనుచు
గాపనుచుఁ గుమ్ములాడునక్తంచరాళి, యెంతకార్యంబు దమకేమి యెవ్వఁడైన. 151

క. ఒకవీరవరుకబంధము, నకుమూఁగి పిశాచికాగణము భూతావే
శకమున నది యెగిరినచోఁ, బకపకనవ్వించె నులికిపడి డాకినులన్. 152

* సీ. శౌనకమౌని విశ్వామిత్రుతోఁ దెమ్మ పన్నిదం బనుచుఁ జేపట్టి తిగువ
శుకుఁడు * * * *

---

* ఇక్కడఁగొంత గ్రంథభాగము మాప్రతిలో లేదు.

మాలిని. ధరణిభరణశేషా దర్పకద్వేషవేషా, శరనిధిసితకీర్తి సౌధయూథాగ్రవర్తి
వరగుణమణిజాలా వర్ణితోద్దీర్ణలీలా । నరపతికులహేళీ నారనక్ష్మాపమౌళీ




ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమ
న్వయాభరణ నారాయణభూపాలతనూభవ శఠగోపతాపసేంద్రచరణారవింప
సంచలన్మానసమిళింప సంతతభారతభాగవతాదిశ్రవణానంప కామినీమనోహర
రూపరేఖావిజితచైత్ర కాశ్యపగోత్రపవిత్ర జాతివార్తాకవిజనామోదసంధా
యక చిననారాయణనాయకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రంబను మహాప్ర
బంధంబునం బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీరమణీమృదుపదలా ׀ క్షారసకోపారుణప్రసారితవీక్షా
దూరితవైరికలాపా, నారీనవకుసుమచాపనారసభూపా! 1

గీ. అవధరింపుము జైమిని కలపతంగ, కులపతంగంబు లిట్లని తెలుపఁ దొడంగె
నట్లు పాతాళకేతుఁ డయ్యాతుధాన, పటలికన్నను మున్నుగాఁ బొలుపెంచి. 2

క. దళవాయితోడఁ గోటకు, వెలుపటియిల్లులుగొట్టివేయించి పిరం
గులు లగ్గంబులమీఁద, న్నిలిపించఁగఁ బనిచి నిగుడు నెవ్వగతోడన్. 3

చ. అరిగిపురంబుసొచ్చి పలలాశనమాళి కుమారుతోడమే
ల్సరియగు దైత్యులం గపనుల న్నిలువ న్నియమించి యాయస
స్ఫురణఁ దనర్చు కోటతలుపు ల్బిగియించఁగఁ బంచి ధీరతా
స్థిరమతిఁ జేరఁగా నగరుఁ జేరి హజారము నందు నిల్చుచున్.



క. మించు తమిఁ గణజము ల్దెఱ, పించుచుఁ గైజీతములకు వేర్వేఱ న[illegible]
యించుచు నెలకొలువునకుం, బంచియిడుచు మందుగుండుబాణము లెల్లన్. 5

క. ఇటు లుండ నచట నృపుఁడు, ద్భటగతి దానవుని కూటిపాలెం బెల్లం
దటుకునఁ జూఱ లొసంగుచు, నటు నిలువక సేనతోడ నప్పురిఁ జొట్టెన్. 6

చ. అచలితవృత్తి నిట్లు విడియం దళవాయి పలాశి వీడు మె
చ్చుచు నలకోటకేగు జలసూత్రపుఁ జోటు లెఱింగి యడ్డ క
ట్టుచు రసవర్గ మచ్చటకడున్వాడిఁ జేరఁగ నీక శూరతా
రచనలఁ జిల్లరల్చలుపు రక్కసిపాలియగాండ్రఁ గొట్టుచున్. 7

క. ముత్తికె వేయించిన దితి, జోత్తముఁ డించుకయు బెదర కుద్భటధీరో
దాత్తమతి నగరు సొరక వి, యత్తటి నటునూకు గవనియందె వసించెన్. 8

సీ. తెఱగంటిదొర నరాధిపు మెచ్చఁ జనుటకై నలువతో నాలోచనంబు సేయ
నిలనుండి పిచ్చు వేగులవారి వెంటనే సురహూని గొణుగుచు సుద్దులడుగ
గిరిభేది నగరివాకిటివార్త లడుగంగ దిగధీశులు నియోగి తెగల నంప
అడ్డెలు విడి వేల్పు లమరగాండ్రసురేంద్రు కార్యకర్తలబందుగట్టికొనఁగ
భూరిభుజశక్తి ప్రముచ్చిమిపోటు గాఁగ, మేదినీభర్త పాలెంబునీఁదఁ బడిన
దానవులమూఁక తన్మహోత్కటభటోగ్ర, ఘాటిఁ గ్రిడించి కప్మ్మఱఁ గోటఁ జేరు.

సీ. అచ్చర చెలువ లుయ్యాలచేరులు నేలవై చితి రని తోడి వారిఁ బదరఁ
జోటించుకయుం లేక కోటరంబులలోని యిరవుపాములు పెఱ బొఱియఁజొరఁగ
నఖిలపక్షులకులాయములుఁ బోఁ బిల్లల గఱచి యవ్వలి కోనకడకుఁ బఱవ
ముంచి చీఁకటులుకల్పించు నీడలు పోవఁ బద్మాకరంబుల పాఁచి విఱుగఁ
జెట్టుగులులేని పెనుగారుచిచ్చు వచ్చె, ననుచుఁ జెంచెత లెండకై యలమటింపఁ
బార్థివేంద్రుని భటులు డాబాలు నడుప, నఱకి రయ్యద్రిపై విపినంబు నెల్ల. 10

క. దనుజుల తుపాకిగుండు, ల్గనఁబడు డాబాలు పలకలందాఁకి బిరి
లునఁ దిరుగుఁ దమునియోగిం, చినవారల నొంచ మగుడు చెలువం బమరన్. 11

క. మనుజేంద్రుఁడంత సేనలఁ, బనుపుచు సురతాణి లగ్గఁబట్టించిన న
ద్దనుజపతి వీరధర్మం, బునఁ దెగువకుఁ జొచ్చి యెదుర ముదిరిన కినుకన్ 12

మ. అరరే వేఁడి మెఱుంగు తూపుఁ గొనియయ్యా యెంతయోవింత యా
నరనాథాగ్రణి యేయఁగా నది దిశాంతభ్రాంతిరోచిర్నిరం
తరమై వాని శిరంబు గైకొని యనంతాకాంతపైఁ దార్చెదం
తురసంతోషహృదంతులై దిగధికాంతుల్చెంత చింత ల్విడన్. 13

ఉ. అంతటఁ జేరవచ్చిన వియచ్చరనాథుల దీవనల్మహీ
కాంతుఁడు గాంచి వారి మృదుగౌరవసారవచోవిభూతి న
త్యంతము సంతసం బొదవ నన్చు నిజాంచితసైన్యము న్మహీ
ప్రాంతమునందు నుంచి దరహాసవిలాసవిభాసమానుఁడై. 14

క. నగరిపురిపునగరుంద, న్నగరీరథయూథసౌధనానావిధరు
గ్గగధగలు చూచువేడుక, చిగిరింపఁగురింపరాని చిడిముడి వొడమన్. 15

క. ఒక్కఁడె పవనోద్భవజవ, ధిక్కరణధురీణ మైన తేజిన్వడిగా
నెక్కి ప్రకాశాత్యవశద, దిక్కౌంబగు పురముసొచ్చి ధృతి నచ్చోటన్. 16

ఉ. గోడలుగోపురముల్గరిడి గుళ్లు గృహాంగణము ల్గజస్థలు
ల్మేడలు మేలుకట్టులును మిద్దెలు ప్రాకలు మేలుమచ్చులున్
వాడలు వేదులు న్విపణి వర్గములు న్వనజాకరంబులుం
జూడఁ బదాఱువన్నె గల శుద్ధసువర్ణము లౌట మెచ్చుచున్. 17

సీ. పరఁగఁ బిరంగీల బలుగుండ్లకై డాఁగఁ బలుక లమర్చిన పాఁతరలును
వెలుపటి మంచుతిత్తులు గూలిన యరాబు కొఱకమర్చిన పచ్చిగోడగుంపు
లెనసి మొత్తురు లగ్గకక్కసంపెంగఁ దార్చిన కాంచనంపు పందనపుఁ జేతు

క. తమ కుసుమేయస్థానము, కొమిరెల మృదుపాద మగుటకు వైవర్ణ్య
క్రమ మొందిన సరణి రసా, లములుం గెంపలిరుటాకులం బస రెక్కెన్. 88

గీ. పఱిలె వనరాశిలోనఁ బ్రవాళపాణిఁ, గాంచి యీసునఁ బలేఁ బోఁడకట్టినట్టి
ముత్తియపు గుంపులను దలంపులు జనింప, తారకతమోనివారకకోరకములు. 89

క. వనలతికాలల మాధవుఁ, డనువుగఁ గూడెనని యుస్సురను వనపద్మాం
గనల ముకుళీకృతాస్యము, లనఁగాఁ దరులందు మొగ్గ లరవిరి యయ్యెన్. 90

క. మనసిజుఁడు రోఁజుచుండి, మ్మను తుమ్మెద నల్ల ప్రజలకై నానా పు
ష్పనికరదళనవ్యాజం, బున నత్తఱిఁ దేనెకణజము లద్దింపించెన్. 91

గీ. లతలపై మ్మెన కుసుమజాలంబు లోఁదయ, నకరువుల పేరి యెమ్మెచ్చు పెకలిరాలఁ
దొడిమలక్రిందఁ బచ్చదాతుటుము గాని, పిందె నను బసురుఁజాయలపిందె లమరె.

గీ. మన్మథబ్రహ్మమునకు సమానదేవు, నొకని గల్పించి కైకొనరోయి యనుచు
నలవసంతుఁడు గట్టి వ్రేలాడు పసుపుఁ, బూఁతజాలెలవలె ఫలంబులు నెలంగె. 93

క. ప్రాలిన విరిజొంపముపై, రాలినపుష్పాదులు ప్రసవరస మనుము గ్ర
గ్గిలుకొనఁ బొలుచుచిలుకగు, ఱాలదు నేదారి కొలుచు రాసులనంగన్. 94

సీ. దాఁపఁబెట్టినవా సుధామాధురీధురీణమరందబృందసూనవ్రజములు
కాఁపాడులా యసగ్గళపచేళిమభిదేళిమచూతపోతావళీఫలములు
సంతరించినవా విశాలమార్గవనిర్గరయోల్లూనకదుణార్హ పల్లవమ్ము
లప్పళించినవా వియద్ధరాపథ్యశ్రిప్రాయూథసంచారిసౌరభమ్ములు
దొమ్మిగాఁ దుమ్మెదలుమూఁగి తొక్కులాడు
పొగరుతోఁ గీరములు చేరి జగడమాడు
గొంటుగాఁ గోయిలలు రేఁగి కుమ్ములాడు
మొనసి పలితేమ్మెరలు కెల్లి పెనఁగులాడు. 95

సీ. చిలుక బావఁకొలంబుల బంగుగుల్కఁ గలితామ్రఫలకోటి గ్రాసమొసఁగు
నెలదేఁటి రాచకుంపుల చుట్టములకెల్లఁ బలుకుఁదేనియ పళ్లెబట్టలొసఁగుఁ
జలిగాడ్పు కోమటి చాలుసజాతీయములకుఁ దావులసంచిమొన లొసంగుఁ
గోయిల నాలవకొలముదాయాదుల కేలుకోఁ జిగురాకు నేలనొసఁగు
కొమ్మల నెలరుపు సాలబాలమ్ములోనఁ, జిలుకసాంబ్రాణితేఁజీవజీరుఁ డనుపఁ
డాకెమున్న వసంతుని రాజువెల్లఁ, గన్నుగట్టెడు కడుపుంజి గనుటకతన. 96

మ. ఎసలారం బత్త్రపు దిక్కుతేజిని జూమాయించుచోఁ బల్మాఱు బ

ల్వాడి సంచ్రసమొఖ్యా తేఁజోవిను మేల్వి లెక్కు డించంగ న
వ్వాడవిల్కానికి దూరదేశగమిథోవిశ్లిష్టమోహావల
జ్జడిమకంపితధైర్యదంపతిహారచ్చైత్రాదియాత్రారతిన్. 97

క. ఆతతిఁ దమి వెగ్గలమై, శాతోదరి పొగుల మిగుల జడిసి శరీర
ద్యోతకము లైన చిన్నెల, చేత న్విరహ మని తెలిసి చెలువలు తమలోన్. 98

సీ. ఆయెనమ్మ యిదేటి యాగడా లిదియేమి యెఱుఁగు నిన్నటినేఁటి మెఱుఁగుబోఁడి
యెఱుఁగునా యనఁగూడదిప్పు డిప్పుడు కొంత గడిదేఱెలే పలకారివగల
గడిదేఱ కింక నెన్నఁడు మంచిమగవానిఁ గోరించు జవ్వనం బూరఁజేయ
జవ్వనం బౌనకా చదువుకొన్నది గాన మనసు నిల్వఁగలేక మరులుకొనియెఁ
జెలువ యీబోటి లనుభవించినను గాని, తెలియదే ప్రేగులోపలి తీఁట వంటి
వలపుకసికోఁత లివి పగవారి కైన, వలదుగా దీని కిపుడేల వచ్చెనమ్మ. 99

చ. తడఁబడు మాట గద్గదిక దార్కొను నిల్చినచోటె నిల్వరాఁ
దడఁగులఁ ద్రొక్కుపాటు గదియఁబడుఁ గంపము చెందు నిద్ర రా
దెడపని కోర్కె హెచ్చు మది నేమొ వితావిత జాలిజాలి యా
నడిగినఁ జెప్పఁగూడ దకటా మరులెత్తిన యాఁటదానికిన్. 100

క. ఇవి యన్నియుఁ జెలులారా, చివురాకుం బోఁడియందెఁ జెలువొందెడు ని
క్కువ మింతకు విరహముహో, దవ మేకార్ణవము మీఁదఁ దగ వెయ్యదియో! 101

మ. అతివా యింతకుమున్న నన్బిలిచె డాయంబోయితిం బోయిన
న్బిలిచా యంచనె నేడ కంటి నదె రాజీవాక్షి యేలెన్న వేఁ
డితిఁగా నిన్ననె నేటికే చెలువ యంటి న్నావెత ల్నీకు స
మ్మతమా యన్న వితాకురాలయితి న్నమ్మా కొమ్మ యమ్మాటకున్. 102

క. అని కట్టుసేయు బోఁటులఁ, గనుసన్నలఁ గడకుఁ బోవఁగాఁ బనిచి నమ్మం
జనవిచ్చి మనుపుఁ గావున, నెనసినతమి వనితఁ జేరి యే నెయ్యమునన్. 103

గీ. వచ్చి తడవాయెఁ గద మహీపాలయమహీమఁ
జూచిన గ్లానియెఁ గద యింక శోభనాంగి
పోవవలదె మనపురంబునకు మగిడి
తల్లిదండ్రులు కడుఁ దల్లడిల్లకుండ. 104

క. తెలిసె నిఁకఁ గొన్నినాళ్ళే, యిలఁగల చెలువములు చూప నిచటనె నిలుపం
బలఁబినకైవడి నున్నది, చెలువా యది లెస్స యట్లు చేయుట మేలా? 105

క. అనఁ విన్నఁ జూచి తలవాంచి, చిన సిగ్గునఁ జేతి యేమొ చింతాసంతా
పనిటూషిఁ జెందునంపము, గనఁబడియెదు నిట్టు లౌనో కాదో యెఱుంగన్. 106

చ. సరసిజగంధి నీమది విచారము దోఁపఁగ వేఁడుకొందు తే
టపడఁగఁ గారణంబు నవయౌవనరూపకలావిలాసభా
స్వరుఁడగునట్టి యొక్క మగవానిపయిం గనుమైచి తేమొ దు
స్తరతరచింతచే నడియె కావలయుం దలపోసి చూడినన్. 107

మ. బలభిన్నీలకచామణీ యిదియుఁ దప్పా కాంతులంగోరి కాం
తలు చింతింపరొ కంతుకుంతముల సంతల్లింపరో లేక నీ
తలనే పుట్టెనె యైన నేరమొకొఁ జేతత్కార్య మాద్యంతముం
దలియం బల్కకయుంట నీవలన నింతీ యంతనే వింతటే. 108

క. నావంటి బోఁటి గలుగం, గావగ నఁగ నేల యెంత కార్యంబైన
న్నీవే కావలె నన్నుం, దైవకటాక్షమునఁ గరగతము సేయ నటే. 109

చ. అనవిని యోలతాంగి నగవామతిలన్ననుఁ జూచి భావవే
దినివి గదమ్మ నీకు నికఁ దెల్పకయుండఁగ నేర్తునమ్మ నీ
యనవు మదీయఘోరవిపదబ్ధికిఁ నోడ గదమ్మ వాఁడిమై
నొనరిన కంతుతాపులకు నోషధ గదమ్మ యికన్ వధూమణీ. 110

గీ. నాతి యెఱుఁగుదువా యల్లనాఁడు డేగఁ, జేత వహించి చిన్నతేజీదువాలిఁ
గాఁగఁ దోలుచు నీ త్రోవ గానె చనియె, నామనసు వానినీఁదనె నాటెనమ్మ. 111

చ. కలకల నవ్వుమోము పురిగల్గిన నెమ్మియి నూగునూగు మీ
సలు నపరంజిడా లెగుబుజంబులు చక్కనిముక్కు తేటక
న్నులు నిడుసోగకన్బొమలు నిక్కిన గ్రక్కునఁ బాలుగారు చె
క్కులు గసుమంతకాను తళుకుందొడ లాస్పదమాళికే తగున్. 112

క. కనమో వినమో ఘనమో, ఘనమోహనమోదకారికచ మగవానిం
దినమును భువనంబుల నా, మనము హరియించువాని మఱిగంటి మటే. 113

గీ. వనజలోచన నేను గానలసినట్టి, దానమై తేని నెటులైన మానవేంద్రుఁ
గూర్చి నాప్రాణ మిపుడె నిల్చుకొమ్మ లేని, పక్షమైనను నావిరాఁదిబోళివిడము 114

క. అని పలికి సొమ్మసిల్లినఁ, గని దీని మనంబు తెలిసెఁ గద యికవీఁడన్
మనసిజుఁ డపయుఁడు శరమే, సిన వేమగునో పరాకు సేయుదమనుచున్. 115

గీ: ఎంతలే దింతి యికనెమ్మ సంతయేల, యిందులకు నట్లి యోడఁగూర్చికొండ మబల

యప్పుడు నీచిత్తమే వచ్చు నప్పుడు పట్టి, మాటలాడినఁ గలవమ్మ మానుషమ్ము. 116

క. కొమ్మలకుం బురుషులకుం, గమ్మని విలుకాఁడె వేల్పు గావున నతని
న్నెమ్మదిరాఁ బూజింతము, రమ్మా యలకేలివనికి రాజీవముఖీ. 117

క. అని పలికి యేను నెచ్చెలు, లును మచ్చిక హెచ్చనీవిలోలేక్షణఁ దో
డ్కొని వచ్చి కుసుమవిస్ఫురద్, వనిఁ జొచ్చి రసార్ద్రవచనవైఖరి భేరయన్. 118

చ. అలవడఁ జందిలాలియుతమై సుమనోహరచాపహార్యన
ర్గలగతిమించి పాదపవికస్వరవైభవహారియైన యీ
యలఘువనోల్లసద్ఘనమహత్త్వము నేమని చెప్పవచ్చునో
లలితలతాంగి కామితఫలంబు లొసంగుచుఁ బ్రోచునంపఱేన్. 119

మ. పొలఁతీ యాపొన్నగున్నపొన్నవిరికిం బూఁదేనె బల్కాల్వగా
యలరన్ సారెకు నెక్కుచుం దిగుచు చాలై దుమ్మెద ల్మించె ని
చ్చలపుం జాయలతావిజాజివిరి సేజాజోడు గైకొన్న క్రొం,
దలుకుం బచ్చలమేడఁ దాపు జలయంత్రంబో యనం గంటివే. 120

మ. సరసాళు ల్నిజగంధమానుచుఁ జరించంగుంభినీజాతయు
ల్వరుసం జుట్టుఁ జెలంగుచుండఁగ మహావాలంపుఁ జంజాస్థిచేఁ
గర మొప్పార సుధాప్రభావమధువుల్గ్రోల న్విదాహాతివి
స్ఫురితంబై విలసిల్లె నోయబల యీపున్నాగముం జూచితే. 121

చ. అరవిరివెండిచెంబుల నయంబునఁ దేనియపానకంబు లేఁ
బరువగు గుజ్జుమామిడి చలిపందిరుల న్లతకూనలియ్యఁగా
నరుదుగఁ గ్రోలియు న్సరసిజాస్త్రిగుణస్థితిఁ గందుదేఁటి ని
బ్బరమగుబాళిమై నధరపల్లవమంటుటఁ గంటివే చెలీ. 122

చ. హితగతినిందుబింబరుచు లింపుఘటింప మనోజకాంతసం
గతిఁ దగు కైరవారముల గర్వము మించె వధూటి కంటివే
హితగతి నిందుబింబరుచు లింపుఘటింప మనోజకాంతసం
గతిఁ దగు కైరవారముల గర్వము మించుట చోద్యమే చెలీ. 123

చ. తనతను వెల్లఁ గాఁచికొని దక్షిణమారుతచోరకుండు నే
ర్పునఁ జనుదెంచి తావిఁగొనిపో వనదేవత హెచ్చరిల్లి కో
యని పెనుఁబోటుఁగూఁత లిడునట్టిగతి న్వినవయ్యె వింటివే
యనుపమగాత్రి కోకిలకులావళికేళి కుహూకుహూధ్వనుల్. 124

గీ. మేలితేనియనిండిన మెట్టతమ్మిఁ, జేరి కొలనాడి పుష్పాడిపేకి రక్ష
పాసఁగ నవ్వలిక్రొవ్విరిపురుటియిల్లు, వింతగాఁ జెందెఁ దేఁటి బాలెంత కంటె. 125

క. అనియాలివితతకేళీ, వనపాళీగరిమవోలి వర్ణించుచుఁ గ్రొ
న్ననగుంపుఁ జిదుము వేడుక, జనియింపఁ గడంగి సరససల్లాపములన్. 126




అలివరో చూచితే యలరెడి మావులు—జతగూడిన వివె చల్లనితావులు
ఏలకిపోపలివె యిటురారాదటె—యేలపోయె దన నింతనె వాదటె
చాలుచాలు నీసంపెగ మొల్లను—బాలకంటివే పాదిరి మొల్లను
నెంత రాఁగదే నిమ్మల నీడకు—వలుక నేలనే యంతటి ప్రోడకు
ఎగిరి పడకులే యీకంకేలికిఁ—జిగురుచాలదే చెలి నీకేలికి
నాసలేటికే యంపని పొగడకు—వేసటలే కీవికుల నె పొగడకు
పడఁతి రావు నాపాలిటి పొన్నకు—ముడివిడెరోసము మొన్నటి చిన్నకు
వాసంతికకై వచ్చెను చిన్నవు—రోసమెఱుంగని తొయ్యలి నవ్వకు.
యీవిరవాదుల కేటికి ముచ్చట—తావులవిరి కే తలిరుకు మిచ్చట
నెఱసిన వివికంటివె వాసంతులు—యొఱుకలేద నీకేటికి రంతులు
పోపలిన వచ్చటి పుష్పాపితిన్నెలు—అదిగై కొనిరే యప్పుడె కన్నెలు
తెలిన దాఁటితే తేనియకాల్వలు—వెలదిరి నేఁడీవివ్యకుఁ జెల్వలు
సరసను మొలచెను జాలుగ మొల్లలు—దొరసెదు నచ్చటఁ దుమ్మెదపిల్లలు
బొండుమల్లెలివె పొలఁతిరో మెచ్చితె—పండలు కడుపింతలు గో గ్రుచ్చితె
పలుకకు కోయిలపదువులు మూగెదు—బొలఁతి వెలచితే పూఁబొద లోఁగెదు
వెలఁది చూడు కురువిందలయంపము—కెలఁకులఁ గడుఁ దొలఁగించె మరందము
సురపొన్నల కీసున వెన్నాడకు—తరుణి వెలతు నిత్తపి నన్నాడకు
కోవిదారములకును వాడేటికి—నేవఁ గయ్యముల కేగెదు మాటికి
వనితలు బడలిన వగకనిపించెను—గొనకొని తుమ్మెదకోపము ముంచెను. 127

వ. అని పుష్పాపచయంబు గావించి చాలించినంత. 128

క. మధురిమధురీణసవిధవి, వినమాధవికాప్రసూనవిస్పురమరం
దధునీమిథోవిహృతిమ, న్మధుపపథాళింపమందమారుత మొంచెన్. 129

ఉ. మానవతుల్గనుంగొని దమంచమసందనవారవింపబ్బం
దానుసరన్మిలింపనికరాంశుకబంధురగంధసాంద్రమున్

దానిలమత్తసింధుర విహారవిలోలతరంగజాలడో

లానిశఖేలనాకలితహంసము నొక్కసరోవతంసమున్. 130

వ. ఇత్తెఱంగునం గనుంగొని జలమానవకుమారు లెమ్మెలకై చిమ్ము క్రొన్నెఱుంగుజము దాడుల టెక్కునం దళుక్కున నెగురునిడువాలువాలుగుపిల్లలకై నికటతటతరు పటలశాఖాశిఖానికరంబులనుండి దుముకు లకుముకులగరుత్తులం బెరుఁగు మత్తులం దొఱఁగు సరాగంబు లగుపరాగంబు లందగిలి యరవిందమందిరకుం దార్చినగందవొడియటు పెట్టెలచందంబున నీషదుచ్చలితరథాంగంబు లగుతరంగంబులసందున నదభ్రవిభ్రమంబునం దిరుగుజలభ్రమంబులం దగిలి నిగనిగనికెంపురాలు నింపిన గోమ్ముగను వామదగుంటలం దలపించుటకు శిరఃకంపనంబు సేయుచు జలబిందుసందోహకంపలితచిత్రశతపత్రపత్రసమావేల్లితం బగుహల్లకంబు వారిదేవత కెత్తుమరకతపాత్ర మౌక్తికారాత్రికంబుల డంబువిడంబింప నందులకు సోబనాలువాడు ముత్తైదువుల చెలువున మ్రోయు తేఁటినీటుకత్తియల తేటపాటలకుం జొక్కునోయన నాయకులతోడిపొలయలుకలం దొలంగి చని వనజకుడుంగంబులం గపటనిద్రాముద్రితలై చలితజలాంబులికలు సోఁకిన నులికిపడి యనునయింపం బతు లేతెంచిరని బయలుజంకించు నీటుకత్తియల తేటపాటలకుం జొక్కునోయన నాయకులతోడి పొలయలుకలం దొలంగిచని వనజకుడుంగంబులం గపటనిద్రాముద్రితలై చలితజలాంబులికలు సోఁకిన నులికిపడియనునయింపం బతు లేతెంచిరని బయలు జంకించు జక్కవమించుబోఁడుల యలక్ష్యబహుతరాక్షేపంబుల పెల్లునకుం గొల్లున నవ్వచుఁ బువ్వుంటిసాఁ మవ్వరపునిగేరు మారుతమానవునకుం దీరసంచారిశిఖావళకుమారికాకేకారావంబు లను గద్దింపులం జళుకు వొడమించి నడదిద్దునెపం బర్విన రజంబువిధంబున దుమారంబుగా స్ఫురం బెగయు పుప్పొడి పేరింట నుల్లసిల్లు నుల్లవనీవలవీడుజోడాడు వేడుకలఁ గమలినీకమలబంధుపాణిగ్రహణంబునకుఁ గులదేవతల నెదురుకొనుచదురున లజ్జించుచు పుటసమంచితసకోరకబిసాగ్రపాలిక లగుచు వచ్చు మరాలికాబాలికలకలకలంబులసంగ్రమ్మికొని తమ్మిమేడలెక్కి పెక్కువగల ఊకుచి కొమ్మలసందునం దొంగిచూచు మధుపానరోధ వధూమణుల మిగస్సమ్మర్దకల కోలాహలబాహుళ్యంబులకుం దగవు లూహించుచు నాళీకముకుళంబులను కలశకులంబులం బరికల్పించి నిస్త్రాసంపదం గలహంసదంపతులు ప్రథమసమాగమంబునం బుణ్యాహం బాచరించి యెదురు నూడం బొడసూపిన యజ్ఞాతప్రభాతం బగు నిశాసమయంబు విధంబునం దనరు పరిసరతరుచ్ఛాయామాయాంధకారంబునకుం దిగుల్లుప

డి యప్పటప్పటికి వికసితాంబుజంబులఁ గనుంగొని యవియు ముకుళింపమిం బొం
గు రథాంగకామినుల వినోదంబులకు శేషమోదంబు లనుభవించుచుఁ జెంగటఁ జె
లంగు చెంగలువమాలెపై నంకించిపాడు టెక్కుల తేఁటిజక్కులవారి యాలాపంబుల
లక్షం బరిఫుల్లసరోజం బనుకామిని చేరువఁ బరఁగు విగళితప్రసవపరాగపరంపర యు
నుపరిభ్రమద్భృంగముల డగ్గఱ నంపం బగుమందమరుదాందోళితేందీవరముపైనుండి శివ
మాడు సారసవరారోహలకు సమీపంబున శైవాలకలాపంబు లనుధూపంబులర్పిం
చుచు మూఁగికొని యనాగామికార్యంబు లనుగుణమ్ములక్కులచందంబునం బొసంగు
నానావిధజలవిహంగమాంగనావ్యూహంబున కుత్సాహంబుఁ బొందుచుఁ గమలాక
రాభిధానంబుగా నంగంకణవిరాజమానంబై పుష్కరస్వరూపంబు గావున రాజహం
సకలాపంబై శోభితతరంగవిశాలంబు గావున శైలూషప్రముఖానుకూలంబై సారం
గవిలసితంబు గావునఁ బక్షకరేణుభూషితంబై యొసంగుటకు నంతరంగంబున నా
నంద మందుచుం జేరి. 131

సీ. వారు మీకును నొక్కవయసువారలు గాన నువిద వారికి మీకు నుద్ది యనుచు
నోడినదానిపై నోడిసిన నేలికసానిపాదములపై నాన యనుచు
నాజతతోడ నేకాంతమాడితివి మాగుంపులో నీవుండఁ గూడ దనుచు
నంటిమి గాక మర్యాదతో నిల్చనే యప్పటికైనయట్లగు నటంచు
బాలయులనాఁడు నామీఁద నోలపెట్టి, తిచ్చనిఁక మీఁదఁ జరియింపుమీ యటంచు
నంకు కేమాయెఁ గాని లేవమ్మ యనుచుఁ, బలికికొంచును దొగలు గాఁ బంచికొనుచు.

మ. మెలఁతల్ తుమ్మెదకంటుకమ్మవిరిరుప్మీ పాముపామామ మా
టలతబ్బిబ్బులు కుల్కికీలుజడఁ గొట్టం బూను జేజేలయొ
జ్జలయిల్లాలని వ్రాసినట్టి వలువ ల్చాలించి యచ్చంపు ని
చ్చలపుంజందురుకావి పావడలు మించన్ ఖేలనాలోలలై 133

గీ. డాసి పరి నిల్వ వారినీడలు పొసంగె, నీటిలోఁ దమ్మిమేడల నీటు రోసి
తన్ముఖాంభోజముల నిల్వఁ దలఁచి వచ్చి, పద్మ తాల్చిన విశ్వరూపము లనంగ. 134

చ. సుదతులు డింతిగాఁ గొలనుఁ జొచ్చి చనంగఁ గ్రమక్రమంబునం
బదములు ముంచి పెంపొదలఁ బైకొని పొక్కుట నాఁగి చక్రసం
పదలు సహింపలేని కుచభారము లోఁగొని కంఠదఘ్నమై
తుది నటు ముంచ పయ్యెదలతోయము కంబులు నాఁగమించుటల్. 135

మ. కొలనయ్యింతులు సొచ్చినంతఁ గనిపోఁకల్ వెచ్చిన స్వేఁగుఁద

మ్మలపైఁ దేఁటులు వేఱుతామరలపై మూఁగం దదీయాళిరే
ఖలు వాటింగదుమంగఁ దధ్వనికి రేఁగం జక్కన ల్దాఁటు నె
క్కలిలేఁ దమ్మెరపుప్పొడుల్ చదలనాఁగం జిత్రమయ్యెన్ సఖిన్. 136

చ. చెలువ యొకర్తు క్రొంపసుపుఁ జెందొవ బిట్టెగరంగవైవ న
య్యలరు తదంజలిం బడుట యద్భుతమయ్యె మదీయపక్ష్మరే
ఖలఁ జెలరేగి గాసియిడఁగాఁ దగునే యని యెగుదెంచి చే
తులపయి వ్రాలి వేఁడికొను తోయజబాంధవబింబమోయనన్. 137

గీ. సారసుచ్ఛైలమథితకాసారజలధి, నప్పడప్పుడు వొడము నబ్జాక్షికరణి
నొకశశికళాపమించి వెల్లకిల నీఁద, నమరె ముద్దులుగాఱు చిన్నారిమోము. 138

చ. ఎలమినొకర్తు వెల్లకిల నీఁదఁగఁ జుట్టును గల్వమొగ్గల
గ్గలముగఁ మించెఁ జన్నుఁగవకాంతులు గన్గొనవచ్చెనంబురా
డ్జలరుహగంధి పంపఁ బరిచారిక లచ్చట ముద్దుగాఁగ పొం
దులుగని వైచు గోటములతోడి కడానిగుడారము ల్బలెన్. 139

గీ. మొగము మాత్రంబు కానరా ముద్దుగుమ్మ
యొక్కతె నిలు వీఁత యాఁడఁ జెన్నొందెఁ గురులు
నీరజాకరమనెడు మున్నీటిలోఁ గ్ర
పీటములు గ్రోలు మేఘంబు పిల్లయనఁగ. 140

క. బోరగిల నీఁదు నొకకృ-మి, టారి విశంకటకటీతటంబొప్పారెన్
సారతరాపరపారా, వారావృత మైనభూమివలయం బనఁగన్. 141

గీ. బాలికలు మేలి జీరుకురాలనుండి, నీటికై జారు సౌరు వర్ణింపఁదగియె
నలమధాలసపై నదరంట నేయు, నలరువిలుకాని నుసుదోనియమ్ములనఁగ. 142

సీ. చనుఁగవమీఁది చందనము చెందినచోటు వెలిదమ్మిపుప్పొడు గ్రోలసికొనఁగ
మెడల కుంకుమచర్చ మించి మునినచోటు చెంగల్వవిరిగుంపు చేరికొనఁగ
సారమౌనుదుటి కస్తూరి మీటినచోటు తేఁటిరేజవరాండ్రు మాటికొనఁగ
నెమ్మినిఁ బసుపువన్నియలు పన్నినచోటు నవకంపుటకరులు నాఁచికొనఁగ
జెలువ లీరీతి నీరాడి కొలను వెడలి, తమముఖాంభోజముల నిండు తావిఁగ్రోలఁ
దేనియలు గ్రాయు కన్కలిత్రు తేఁటులనఁగ, జలజకణములఁ గీలుగంటలు సెలంగ.

చ. తటమహిఁ జేరి యంతట మదాలసకుం గయిసేసి తాము న
త్కటమణి భూషణావళులు దాలిచి యేటిపరాకులమ్మయి

క్కటిలకచా శిఖామణికిఁ గోరుకలిచ్చు రమాకుమారు నె
క్కటిభజియింపఁ జన్న నిది కార్యముగాదని యేగి యవ్వలన్. 144

చ. చెలువగు పూఁబొదన్వలపు చల్లెడు కస్తురి తిన్నె యందుఁ గెం
దలిరుపఱఁగిపీఁట పయిఁ దామర తేకునఁ జెంతనున్న నె
చ్చెలి మొగమోరసేయ రతి చెక్కులు నొక్కుచు మోవియానుచున్
గలరన మిచ్చు పచ్చవిలుకాని లిఖించి సఖీశిఖామణుల్. 145

చ. అలిగిన మ్రొక్కి చక్కజవరాలదలించుచుఁ గాలఁ దన్నిన
బులకలు దాల్చు చందురుని పొంకము వ్రాసి వసంతు మత్తకో
కిలములఁ దేఁటులం జిలుకగేస్తులఁ దెమ్మెరయాకతాయలన్
నిలిపి యమర్చి తెచ్చిన వనీకుసుమంబులు కుప్పవోయుచున్ 146

క. పూజించి చిలుక ముష్కి, తేజీచౌరఁ గూర్చి వికచదీవ్యద్గంగా
రాజీవ నవమధుద్రవవ, రాజీవర వైఖరీపరంపరదొరయన్. 147

మ. హిమరుగ్బాంధవ మంత్రహీనము క్రియాహీనంబు సద్భక్తిహీ
నము మత్కల్పితమైన యీనిఖిలనానాసూనపూజావిధా
నము సంపూర్ణముగాఁ దలంచి దయనానందింపు నీవంటి దై
వము చిత్తంబున మెచ్చినం గలుగలేవా మన్మనోభీష్టముల్. 148

గీ. అరయ హరునంతవాఁడు త్వద్గురుశరాగ్ర, దళితపురదర్పుఁడై మహోదరముతోడ
నజ్జశరపాలిఁ గని మాళి నావహించు, ననిన నీశౌర్యసార మేమనఁగవచ్చు. 149

క. దైవం బనిన న్నీవే, దైవము గాకింక నొకఁడు ధవళాక్షుల నా
శీవిషవిశిఖ శిఖార్తులఁ, గావింప న్వారులఁ గూర్పఁగా నెన్వఁడికన్. 150

సీ. వేఁడి యాఁగదవయ్య విహితశైత్యాంధముంధరగంధవాహస్తనంధయంబు
వాఁడి యాఁగదవయ్య వనజాతిసహజాతి మార్దవనవకౌసుమవ్రజంబు
ఛేఁదుచూపుఁ గదయ్య జితసుధామాధురీసారకీరారావగౌరవంబు
వింతసేయుఁ గదయ్య సంతతాత్యంతపోషితహంసకాంతానిక్షేపణంబు
కామినీకాముకులకు యోగప్రసక్తి, దక్షుమగునీకటాక్షము దప్పెనేని
గాన నిను గొల్చువారిదే కౌశలంబు, భవజయోన్నిద్రతారిణా పంచబాణ. 151

సీ. వీటిఁబుచ్చవె దాసవిభుకన్యఁ గను బరాశరమౌనివరుసదాచారగరిమ
బైటసైనవె బృహస్పతిభార్యఁ గనుఁగొన్న తారకాకాంక్షినీధవునిగుట్టు
నగడు సేయవె యహల్యాకాంతఁ జూచిన యమరలోకాధినాయకుని నడత

కొదవ వొనర్పవె కూర్మికూఁతు నీక్షించి యుబ్బినపద్మసంభవు పెద్దతనము
భావభవ యమ్మచెల్లగా నీవుచేత, నేజఁ బట్టిన నెవ్వారు నిలుచువారు
మారమణి నింతయేఁచిన యాఋతుధ్వ, జేంద్రుఁ జెనకంగఁ జాల వదే మొకాని. 152

క. మారామపట్ల నీసుష, మారాజచ్ఛరను దాఁపుమా రాజ యిదే
మారాటమునకు నోర్వను, మారాజముఖీమణీకుమారా మారా. 153

క. అని మగువ యపుడు మగుడం, బనివడి పొగడ న్మధాంధపాంథజిగీషా
తనుతత్తురంగహేషా, ఘనతరఘోషాప్తి యొదవఁగాఁ గలఁగుటయున్. 154

శా. చీనాచక్కెర ఖాణపుంబులుఁగుఁ దేజీజోదు కేదంగి బ
ల్లానాకత్తికిఁ దత్తరిల్లి నవలా సాయంసమారంభవే
లానాళీకిని లీల సొమ్మసిల బాలాపాలికల్ చంద్రకాం
తానర్ఘాంతిక వేదిఁ జేర్చి బహుచింతాకంపిత స్వాంతులై. 155

సీ. మదనుగుణవ్యక్తిఁ బొదలెడు తేఁటులే మంచకింకను ఝుంకరించఁ దొడఁగె
మానసప్రేమ యేమఱని రాయంచలే మించికొంకక హుంకరించఁ దొడఁగె
సహకారవృత్తిచే జరగు రాచిల్కలే కొంచకిక్కడ వెక్కిరించఁ దొడఁగె
ఘనమైత్రిచే నెమ్మిగను నెమ్మిగుంపులే ధృతియింకఁగా హుంకరించఁ దొడఁగె
నేమి చేయుదుమే బోఁటి యింక నేఁటి, మాటలే పోటుమునకు మగువమీఁద
నింతపగయేల బాలవాఁడేమి చేయు, మనలపాపంబు పాలియింప ననుచు మఱియు.

ఉ. కొమ్మ చిగుళ్లు ద్రవ్వ లతకూన విరుల్గొనిరమ్మ పద్మినీ
తమ్ములు గొంచురమ్మ వనితామణికి న్ననశీతలోపచా
రమ్మొనరించకున్న వలరాయని రాయడి నేమి పుట్టునో
యమ్మక చెల్ల యింకఁ దడయం బనిలే దని సంభ్రమంబునన్. 157

సీ. అడుగునఁ బఱవైచి రని దళం బెత్తునో నెత్తమ్మి పదముల నిలుపనేల
యంకంబునకుఁ దార్చి రని పారవిచ్చునో యనఁటు లూరుల చెంత నునుపనేల
యధరభూమిని నిల్పిరని మొనచూపునో చిగురాకు కెమ్మోవిఁ జేర్ప నేల
యంబకమ్ముల నుంచి రని యెఱ్ఱవాఱునో హల్లకంబత్తుల నలమనేల
యిచట సమవస్తుసంయోగమేల యమ్మ, యిదియుఁ బగవూనె నేని నీయిగురుఁబోణి
తాళలే దమ్మ మీ నేర్పు చాలునమ్మ, తరుణియివి యెల్ల మదనసాధనములమ్మ. 156

క. అనుచుం బెనఁగొన్నతత్తర, మునఁ దగు శిశిరోపచారములు చేయుటయున్.
మనసిజశిఖి బగ్గురుమన, నెనరునఁ దత్సఖులగుండె నెగ్గురుమనఁగన్. 158

సీ. తనులతమీఁద జివ్వనినంకి మిహికాంబుకాండ మెంతయు నిరాకార మయ్యె
నఱచేతిపైఁ జాఱుచుఱ ద్రుక్కి యందంద గందమ్మి పుష్పరాకృతి వహించెఁ
గలికి కన్నులమీఁదఁ గమలిన పరువంపు వనగుత్తు లరయ సూనంబు లయ్యె
మినుకుఁ జందోయిపైఁ దునిసి మౌక్తికరాశి తిలకింప ముత్తెంపు తెరలువూనె
బళిర యివియెల్లఁ దమపాటు దలఁప కిప్పు, డంగజాగ్నికి సాహాయ్య మాచరించి
కొమ్మపై వేఁడి చూపె నాకమ్మవింటి, యెమ్మెకానికి విజయకాలము సుమ్మ. 158
గీ. అదియుఁ గాకిందుఁ జనుదెంచునపుడు తమ్మి, విరుల దగుకమ్మదెమ్మెరల్ వీచెనమ్మ
గైకొనక వచ్చినంతయుఁ గంటిమమ్మ, యబలనిందుండనీయరా దమ్మయనుమ. 160
క. ఇందీవరలోచన లిం, దిందిరకచ సేదదేర్చి తెచ్చిరి సుషమా
కందలితైందవరుచిగిరి, మందిరమగుధవళవసనమందిరమునకున్. 161
గీ. ఇట్లు చెలువలుదోడ్కొని యేఁగుదెర, నంబుజాననతనగుడారంబుఁ జేర
ననిన జైమినిముని యావిహంగములన, నంతర కథావిషం బెట్టిదని యడిగిన. 162
శా. లక్ష్మీశోపమ వీరవేంకటన్నృపాలశ్రీమహారాయ ద
త్తక్ష్మామండల మండనాయితయశోదామాభిరామాఁకునీ
రక్ష్మాపతీన కార్తికీకుముదినీప్రాణేశ చారుప్రకా
శక్ష్మాబ్రత్పతిపక్షభూమిపతియోషాలోచనాంభోరుహా. 163
క. ధాటీఘోటీఖురఖుర, కోటీపాటితవిరోధికుతలపతిశిరః
కోటీరహారశకలవ, ధూటీనవమదన విభవధూర్వహసదనా. 164

పంచచామరము.

వదావదాహిభోగిరత్న వర్ణవర్ణితక్షమాం, గదాగదాసిమద్విరోధిఖండనాత్తలోకసు
మ్మదా మదావళారివిక్రమస్ఫురద్యశఃకలా, పదాపదానవద్రులోకపారిజాతవైభవా.

గద్య.

ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ నవరమన్వయా
భరణ నారాయణభూపాలతనూభవ శఠగోపతాపసేంద్రచరణారవింద సంచలన్మ
వసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహర రూపరేఖావిజి
తచైత్రకాశ్యపగోత్రపవిత్ర జాతివార్తాకవిజనామోదసంధాయక చిననారాయణనా
యకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రంబనుమహాప్రబంధంబునందుఁదృతీయాశ్వాసము



శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## చతుర్థాశ్వాసము.

---

క. శ్రీరాజద్వేంకటగిరి, శౌరిపదాంభోజభజనజనితోజ్జ్వలతో
దారవిభవేంద్ర సవరము, న్నార్థాయణభూపచంద్రనయగుణసాంద్రా. 1

గీ. అవధరింపుము జైమిని కలపతంగ, కులపతంగంబు లిట్లని తెలుపఁ దొడఁగె
సమ్మదాలస పటకుటీరంబుదారి, కమ్మతావుల తెమ్మెరల్గ్రమ్ముదారి. 2

క. వనిసొచ్చుట మరునకున, ర్చన లిచ్చుట సొమ్మసిల్లి సఖియలవలనం
గనువిచ్చుట వారచటికిఁ, జనుదెంచుట యెఱుఁగలేక తన్మయదశచేన్. 3

సీ. మనవులు విన్నవించిన వినునోయంచుఁ జేమకన్నియమిన్న చిన్నఁబోవ
ననబంతి కానుకిచ్చినఁ జూచునోయంచు వచ్చునెచ్చెలి తలవంచికొనఁగఁ
నెనరుతో హెచ్చరించినఁ బల్కునోయంచుఁ గదియు పైపలి సిగ్గుగాంచి యొదుగ
గసపించి జాతిచెప్పిన నవ్వునోయంచు నరుదెంచుహరిణాక్షి యవలి కరుగ
వినక చూడక పలుకక వేదనాప్తి, నవ్వకాపద్మనయన కాంతవశరాగ్ని
తప్తకిసలయముక్తనూతనపునఃప్రప, వాళికృతశయ్యఁ బొరలాడు వేళయందు. 4

ఉ. ఈవనజాయతాక్షిఁ దరుణేక్షుధనుష్కతురుష్కమాళి యా
హావెతవెట్టెనంచు హృదయార్ద్రినయాభ్యుదయాప్తి చేత రా
జీవశరప్రహారగతిఁ జెందుట తెల్పఁగ నేగె నాఁగ గం
గావిభుఁ జేరెఁ గింశుకనఖద్యుతిఁ జొత్తిలి మిత్రుఁ డయ్యెడన్. 5

శా. ఛాయాప్రాగవకర్షణంబు సరసీజాతాంతభోగంబు కో
లాయానీకపతంగపాకపితృజాలప్రాప్తి పాంథప్రజా
స్థేయస్థానగతిప్రబోధకము దూతీప్రార్థనారూఢజా
రాయత్నంబు జరన్మహాతప ముదారంబయ్యె నంతంతకున్. 6

చ. వడి నపరాద్రిఁ జెంద నని వాసిగఁ బద్మిని నెత్తిమీఁదఁ జే
యిడి కరసంగతి న్సమయమేగఁ దదాశఁ గుఱించి రాగమే
ర్పడఁగఁ జనంగఁ దేజమెదఁ బాయఁడె యీయినుఁ డంచువ్రేంత పె
ల్లడరఁగఁ జాటుసూటి సరసాళికతు ల్మొఱసెం గొలంకులన్. 7

చ. అవిరళనిర్గళన్మధురసాగ్రనిబద్ధ నిజానుబింబకై
తనయున హేళి కాలవశత న్నిజపద్మగృహంబుఁ జేర మా
ధవపద మాటచే రమ మదభ్రమరాళితమంబు వాని వెం
దవులక యుండఁగాఁ దలుపుదార్చె ననన్ముకుళించెఁ బద్మముల్. 8

ఉ. ఏకరథాంగభావము వహించిన నన్నిటు డించి పోవుట
ల్నీకునితంబుగా దయిన నీవలె నేనును నీరధిప్రవే
శాకలనంబుగాంతు ననునాకృతి భానుని దేఁచిచూచుచుం
గోకము బాష్పవార్ధి సమకొల్పె భవిష్యవియోగఖిన్నమై. 9

ఉ. ఎంతయు బాడబంబు తనయింటికడం జెలువొందు జీవనం
బంతయుఁ గొల్లలాడ భువనావనశాలివి నీవు పేక్షగ
న్నింతువె యంచుఁ బాశి మొఱ వెట్టగఁ జక్రము దానిపై రమా
కాంతుఁడు నైచెనో యన వికర్తనుఁ డయ్యెడఁ గ్రుంకె వార్ధిలోన్. 10

చ. కరముల బల్మిచే మెఱయు కంజహితుం డను మేటిజెట్టితో
నరుసుగఁ బోరిపోరి సమయప్రతిమల్లకులేంద్రుఁ డాతఁడై
హరువుగఁ ద్రోచి మేనిచెమటారఁగఁ దాల్చిన యొఱ్ఱమట్టినాఁ
గరము నరెం బ్రభాళిరుచిగంధఘురంధరసాంధ్యరాగముల్. 11

సీ. రవిగ్రుంక ముకుళించు రాజీవములఁ బాసి గమిఁ గూడు తుమ్మెదకదుపనంగ
విభునిఁ గానక భూమి వెదుక నేతెంచి చొప్పడు ఛాయ విశ్వరూపం బనంగ
దొగ నంటు సోమాఖ్య నెగడి రాఁగలఁ డంచు గుమిగొన్న తామసగుణ మనంగ
శేకొన్న పతి రాక కైకొన్న ఘుటిపుచుఁ గొనవిప్ప కురులడాల్గుంపనంగ
కాముకాగమనప్రతీక్షాపరాయ, త్తోత్పలాక్షీజనాంజనవ్యూఢవిస్మ
రాయతాక్షీణనవవీక్షణౌఘమునఁగఁ, దండిచీఁకటితండంబు మెండుకొనియె. 12

సీ. నటదుగ్రధూర్జటినాట్యభిన్నాంతరిక్షమునఁ దాల్చిన వెండి కట్లనంగ
జవమంద మందగంధవహాప్తి మింటిపై రాలు వేలుపుఁబ్రమాని పూలనంగ
యామినీవిభువివాహమున కంబరవేది వరలు ముత్తెపురంగవల్లు లనఁగఁ
దమపుష్కరాభిఖ్యతథ్యంబుగా వియత్పథము చెందిన వెల్లదమ్ములనఁగ
సమయమనుయాత్రనాళీకసార్వభౌముఁ, డంబుజంబులఁ జెండు రోలంబపఙ్క్తి
యనుతుపాకిని గగనలక్ష్యంబు నైవఁ, దగులు సీసంపుగుండ్లనాఁ దార లమరె. 13

క. అలపూనుపుగట్టు నగరు, న్వెలునదు రాజునకు మ్రోల వేశ్యాసతి మె

చ్చెలకుచ్చుఁ బట్టి నెఱచిన, వెలిపావడ యనఁగఁ దూర్పు వెలుఁగం బాఱెన్. 15

సీ. తనభానుసంతతి ధరమీఁద వెలయింప భువిఁ గాధిపతి గురుస్ఫురణఁ బెంప
రహిఁ బావమహిమచే నాతినారి నొనర్ప నభవోగ్రధర్మ మొప్పారఁ జేయ
మానిత ధరణిజాతానంద మొనరింపఁ బాంథరామాత్మదర్పంబు లడఁప
వనగోరికమలవర్గస్ఫూర్తి దూయింపఁ దారేశరూఢివర్ధన మొనర్పఁ
జెనె రాయనిగర్వంబు గారుపింప, సమధి[illegible]పలాశపరచక్రసమితి నొంచ
నమితకువలయపరిపాలనము నెమ్మిగఁ, దూర్పుదెస రామచంద్రుఁడు తోఁచె నపుడు.

• ప్రాగ్దిశాంగన కెంగేలఁ బట్టినట్టి, పురుతకాల్పెట్టుగ విసెన పామువు వలన
నంచుమొలదిన నిద్దంపుటద్దమనఁగఁ, బొడుపుఁగొంపున జాబిల్లి పొడిచె నపుడు. 17

చ. అమలిన శుక్లపక్షమొనయం బగు తద్ద్విజరాజు మించి భే
దము సవరించి తేర్చు తెలితల్కులపాలనఁ బాంథదేహపాం
డిమ బలెఁ జంద్రిక ల్నిగిడె డించిన నీరవఁ గాము కాత్మమో
హము వలె నంధకారనివహం బది యెక్కడనో యడంగఁగన్. 18

క. ఆకరణిఁ బొలుచు హృదయ, వ్యాకులతాతాపకారి యగు శోకారిం
జేకూరిన వగ వేఁడుపు, రాకూరిమి పట్టి యబ్బరంబుగఁ బలికెన్. 19

మ. సెనరొందం ద్విజరాజుగా యితఁడు పోస్ యంచు నే నూరకుం
డిన నీవెంచక యేతువే యిటులఁ గాని మంచిదే చంద్ర నా
నుకువాలుంజవ చిల్క్రాయనికి నిన్ను స్మేఁత గావింతురా
వినురా యేటిపరాకురా కుసుమధన్విం గూడి వేఁ రాకురా. 20

గీ. అమృతరామకమండలు హరిణకృత్తి, కాసమన్వితు నుద్దండ కరుని నిన్ను
గన్న సన్న్యాసిగతి దోఁచుచున్న దరయ, గగనమధ్యాభియుక్తి నీకగునె చంద్ర.

గీ. శరధిఁ దోచుట నాళీకపరవిధంబు, గోరి కాంచుటయును ద్రోయుగుణముఁ గల్గ
వింటనంటుట మమ్మోఁచుచుంట తెలిసె, నేయువారలఁ గానమో తోయజారి 22

క. నళినాప్తువలన మండల, కలితుఁడవై వెలయుటెల్లఁ గలిగిన కరణిం
దలఁతువె శంబరహారికిఁ, గలదే యుపకారమెందుఁ గమలకులారీ. 23

సీ. నినుఁ గడుపారఁ గాంచినవారిరాశికిఁ గడలేనిపాటులు గాంచవలసె
నిను నారికోరి కైకొను కల్వచెల్వకు విషములోఁ బ్రతుకుఁ గావింపవలసె
నినుఁ దలమీఁదఁ దాల్చిన శూలపాణికి నవిభవోపేతుఁడై యమరవలసె
నిను నమ్మి కొల్చి నిల్చిన తారకాళికిఁ జింతింప దుఃఖంబు చెందవలసె

నెవ్వరికి మంచివాఁడ విల్లెంచి చూడ, నించువిలుకాని కొక్కనికే మెకాని
వానిప్రథమాస్త్రి విభవంబువారి కొనవె, రాదు నీ చెల్మి చేయఁ దాశాసహాయ. 24

గీ. పాంథమదఖండనోద్దండపద్మకాండ, గర్వసాహాయ్యకలయొందు గన్న నీకు
నమరభోజ్యకళాకలనంద్రుఁడులోకు, లోకటికిఁ బదాఱు గల్పించి యుత్పలాప్త. 25

గీ. అనుచు రామాలలామ పాంథాతిభీమ, ధామచయసీమ యగుచందమామఁ గినిసి
వినిశితాంభోజనారాచ మెనసి యేఁచు, మనసిజు గుతించి కొను మని ట్లనుచుఁ బలికె.

గీ. అబ్జనీవైరి నీతండ్రి యైనగరుడ, గమనకేళికిగుఁ డెంబోగాల మింత
కొదవలే నీదుతల్లికిఁ గొంప చెఱుపు, వీఁతోఁ గూడి యేఁచకు విషమబాణ. 27

చ. కమలశరా నినుం జెఱపఁగా నియమించినఁ జేరిమూఁడుగా
శ్ళముసలి కోవునం దయలలాట విలోచనకేలి నిన్ను ని
క్కముగఁ గరంచనుండె ననికాదె గిరీంద్రకుమారికానరుం
డమలినమంత్రదక్షసవనావని నాతనిఁ బాఱఁ ద్రోలుటల్. 28

సీ. భామానిరూఢి గన్పడ మండలాగ్రంబు మెఱయించు మొదట నీమేనమామ
కొమ్మలపైఁ బండ్లుకొటికి లావులనల్లఘాటి కన్పించు నీఘోటకంబు
కాంతాళిపైఁ బరాగస్ఫూర్తిఁ గల్పించి చెనకంగఁ జూచు నీచికిలితూపు
నారులమ్రోఁత నానందించి నిలువెల్లఁ గన్నులు దాల్చు నీకార్ముకంబు
బలిబలీనీకు బ్రాఁకైన తలిరుటాకు, లడవి లతకూనలన్నఁ బైసంటి నిలుచు
నీవు మామీఁద శౌర్యంబు నెఱపుటరుదె, మానినీప్రాణచోర్ధరమాకుమార. 29

చ. వనజకృపాణ చల్లనయివర్తిలఁగాఁ దడిపాఁతగొంతు గో
సినగిలిఁ దమ్మివాలు గొని చిమ్మెదు పాంథులమీఁదఁ దేనెఁబూ
సిన పెనుఁగత్తి కావలయుఁ జేతికి నీకది విప్రయోగమొం
దినయల ముద్దియం దగిలి నెయ్యముఁ జూపఁగ నెట్లు లోర్చితో. 30

గీ. అనుచుఁ జెల్వపుఁ జెంగల్వయరిదికిరుసు, దురుసుమాష్టిని బవరి యుయ్యరుసుపట్టి
గురుసుమద్యోతనునిదూఱిగరుసువీఱి, పేరెములువారెడు మరుత్కుమారు ననియె.

సీ. మిడలపై నిడలేక పడగలు చిదిసిపో మేదిని భారమై మెఱయుఁ గాత
గట్టిగా నూపిరికుట్టు పట్టంగ నాళీకనాభుఁడు పవ్వళించుఁ గాత
నాభీలపాతాలమైనను జొరఁ బాఱి పిల్చి తార్క్ష్యుండు నొప్పించుఁ గాతఁ
గృతియైన భాష్యకృత్కెక్కయందు నొకమాట తగుచుట్టుఁ బ్రోవయై తాఁకుఁ గాత
ప్రబలపన్నగకులరాజ్యపట్టభద్రుఁ, డెన్నపసవీడ నొకప్రక్క నిన్ను మెసవి

లేఁడు పొమ్మని యనకున్నవాఁడు గాన, చలితపాంథవిహార శీతలసమీర. 32

క. కడుఁ దాత్పర్యము నాపై, నిడుతామరసాక్షితోడి యీనెయ్యంబు
న్విడుకారింపకు మదిఁ, జెందెడుతాలిమి నొక్కవిడుత తెమ్మెరబుడుతా. 33

సీ. అనుచు నిక్కాంత వలవంతఁ బెనిచి వేఁడి, దొరలఁ జెందిన కష్టదెమ్మెరల దాఁటి
ముమ్మరమ్మగు తాపమ్ము గ్రమ్మఁ దమ్మి, పానుపున సొమ్మసిల్లుచు మేను సేర్ప. 34

ఉ. ఏను మనంబులోనఁ జెలు లింద అలంతలఁ జెందిరంచు
నప్పానుపునందు నిక్కలికి ప్రక్కనె యించుక పవ్వళించు న
చ్చోనిఁక నేమి తెల్పుదు యశోధన కోలలఁ గొట్టి లేపిన
న్నెమ్మె నెఱుఁగంగనీక రొదవె నిద్దుర యిద్దురవస్థకై వెసన్. 35

ఉ. అంతట మేలుకాంచి నయనాబ్జము లొయ్యన విచ్చిచూడ ని
క్కాంతయు నేను నిక్కధరగహ్వరపట్టనరాజగేహసౌ
ధాంతమునందు నుంటిమి మహాత్మక యిప్పు డిదేమొ యంచు మే
మెంతయుఁ జింత వంత గుఱియింప భయంపడి యున్న గ్రక్కునన్. 36

క. పాతాళకేతుఁ డంట యొక, దైతేయుఁడు చేరవచ్చి సంభోళిహాటా
త్పాతాద్రిభీతహరిణీ, రీతిం బగు మమ్ముఁ జూచి కృతహాసముతోన్. 37

క. లోకములన్నియు నన్నుం, గైకొనిపూజించు మీనుగామీరానా
ళీకాంబకుఁ బూజించితి, రాకామినులార నాకరం బెఱుఁగరొకో. 38

సీ. ఇప్పు డేమయ్యె నింక నాయించువింటి, వాఁడనుఁగు నేఁడు గూర్చి మీవాంఛదీర్ప
నేర్చునో నేరడో చూచి నెఱతలార, యింపుపసలార నన్నుఁ బూజింపుఁడనుచు.

క. ఒక హెగ్గడి దానవనా, యకుతో నేమేమొ తెలిపి యాతఁడు వికట
భ్రుకుటీపటుతరనిటల, ప్రకటీకృతరోషుఁడై సభాస్థలికరుగన్. 40

క. ఆవచ్చిన చెలి నాతో, నేవగల ఋతధ్వజేంద్రుఁ డితనిం జంపం
గా విడిసినాఁడు బ్రదికితి, రేవేళకుఁ దాళుఁ డనుచు నేగె న్వేగన్. 41

సీ. నాఁటనుండియు వలవంత నాట నీవ, ధూటి పడుపాటు కనుచు దోధూయమాన
మానసాంభోజనై యున్న దాననయ్య, యనఘ నాపేరు కుండల యంద్రు సురలు.

వ. మహాత్మా! యిది మదీయవృత్తాంతంబు దురంతసంతాపచింతాపరాయత్తం బగు చిత్తంబు వివరింప భవత్కథాకథనంబున కడ్డంబుగా నింతయు విన్నవించితి. నీయప రాధంబునకుం బ్రార్థనారంజకంబగు నంజలిరచియించెద నాఁడు ఋతధ్వజవసుంధ రాపురందరు దారుణం జూచుటం జేసి నిర్ధారణాసామర్థ్యంబు లేమిం జేసి డోలా

యమానమానసనై యున్నదానఁగాని నీయందలి సౌందర్యగాంభీర్యాదిగుణంబులు స్వయంప్రత్యభిజ్ఞావిధాయకంబులై యున్నయవి. అయినను మద్విలోచనచకోరికా చంద్రబింబంబగు నీమూర్తియుం బోలె యుష్మద్వృత్తాంతంబుఁ గూడ మన్మనః కమలంబునకు మార్తాండమండలంబుగా నానతీయ నవధరింపుము.

చ. అన విని యాజనావనగుణావని యావనితాశిరోమణిం
గనుఁగొని యింత నేర్పరివి గాక యయుండిన నీవధూటి కిం
పెనయ వయస్య వౌదువె భళీ యిటువచ్చెను రాతుసాధముం
దుసుమ బుతధ్వజుం డనవుడున్ భవదూహకుఁ దప్పు గల్గునే. 44

క. నాకోరికతో నీక, న్యాకాంక్షిత మెల్ల సఫల మయ్యెం దివిష
ద్భికరుఁ డీవసుజుఁడు ఘో, రాకారతఁ గూలె మచ్ఛరావళిచేతన్. 45

గీ. అదియు నెఱుఁగుదు వింక నేణాంకవదన, మంజువాణియు నేను నీమాటలోని
వారమైతిమి మాకు నేదారి నడువ, వలయునో యట్లు నడిపింపు పలుకులేల. 46

చ. అనవుడు నమ్మదాలస ముఖాబ్జమునం జెఱునవ్వువెన్నెలల్
నునుఁ జనుదోయిపైఁ బులకలున్ నిటలంబున ఘర్మబిందువుల్
మనమున సిగ్గుఁ గన్నుఁగొనలం బ్రవహించు ముదశ్రుపూరముల్
కనఁబడ నున్నఁ జూచి చెలికత్తియ యత్తఱి రాజచంద్రుతోన్. 47

చ. ఇపుడు గదా మదాళి పయి నెత్తిన వింటిపయిం జెలంగు నం
దపువిరిదమ్మికోలు దెసనా దొరకేల్ రతి నిబ్బరంపుఁ జి
బ్బెపు వలిగబ్బిగుబ్బకవనై జెరలాడెఁ దోడంగె నేఁడుమా
తపము ఫలించె నింక వసుధావర తామస మేటికియ్యెడన్. 48

సీ. వేఁడిసెగల్గల్గు వేల్పు సాకిరిగాయైన యప్పుడు గాని కేలంటరాదు
ప్రామిన్కురోపలు గన్పఁట గంటెకట్టునప్పుడుగాని గళయుక్తిఁ బొందరాదు
పొలుపుగా వ్రేలిమి బొట్టుమరించునప్పుడుగాని ముంగురుల్ పొదువరాదు
మొకమోర సేయు సన్నికలు మెట్టించు నప్పుడుగాని పాదాప్తిఁ బొరయరాదు.
వృషదంపతులకు విడెమిచ్చుమోవ, మెనయునప్పుడుగాని పానెక్కరాదు
నీ వెఱుంగవె శాస్త్రోక్తి నిర్ణయమ్ము, వారము లుదారకుంభినీజంభవైరి. 49

ఉ. ఏను వచింప నీవు వినుటిప్పుడె కా యిఁకమీఁద నీసరో
జానన యొక్కవేళఁ బొలయల్కఁ బరాకున నున్న యప్పుడే
మోనముఁ బిల్లు పెద్దతనముం గనినప్పటికైన నీసుపా

దానతి నాకుఁ బోఁటియయి యప్పుడె యప్పని నేర్పకుండునే. 50

సీ. రాచిల్క యాయబారమున దారికిరాక చద్దింపు కోరమీసములు దువ్వి
యదిగో దనుచు నింతటంతటఁ జేరరాఁ గేడింపబిట్టుగాఁ గేకవైచి
నీ బంట నన్ను మన్నించవేయన విని వినమిసేయుచు దుంటవిల్లునంచి
దుడుకుగాఁ జెఱగంట ముశిగొన్న బొమ్మలానించిచూచిన తెగనింపఁ దీసి
యతనుఁ డీయింతికలుక చల్లార్ప నీవు[illegible]దముల వ్రాల దీనబాష్పములు చూచి
యస్త్రసన్న్యాస మొనరించు నట్లుగాఁగ, నింపు సొంపారఁగా విహరింపుఁడింక.

గీ. అనిన ముదమంది యమ్మందరాద్రి ధీరుఁ, డావధూటులఁ దోడ్కొని యాత్మపురికి
నరుగుటయ కాని లేదు కార్యంబటంచు, నగవుదైవారఁ గుండలమొగము చూచి.

క. మంచిది మనపురిఁ జేరుద, మంచు న్లేచుటయు నవ్వయస్యయుఁ గమ్మల్
మించుగ నసియాడఁగ బదుఁ, డంచుం జేఁజూపి మందహాసముతోడన్. 53

చ. చెలంపుని వెంటఁబోఁ దరువు సేయు మనోజ్ఞము మాట చెల్లనీ
కలమెడు లజ్జకన్న ఘనమైన కట్రీతటి వ్రేఁగున న్నడ
త్బైళకఁగ నంచబిత్తరివలె న్మరిపంబున నమ్మదాలసా
జలరుహగంధి రా నృపతిచంద్రుని వెంబడి మేడ డిగ్గినన్. 54

మ. అతఁ డచ్చోఁ దురగంబు నెక్కి హృదయాజ్ఞాపూర్ణమోదార్ణవాం
చితుఁడై వారల వెన్క నుంచుకొని యత్షీణైక్యమాణిక్య దీ
ధితిజాతావృతదిగ్వితానము మగుడై తేయాధినాథాయతా
యతనం బల్లన నిర్గమించి పురబాహ్యక్షోణి కేతెంచుచున్. 55

ఉ. అచ్చట నున్న సైన్యము బలాధిపతు ల్వెనువెంటరా సము
ద్యచ్చటులార్భటిం గువలయాశ్వుడు దేయని చాకుచేసినన్
బ్రోచ్చలితావనీరజము లొక్కమొగంబుగఁ బిక్కటిల్లవై
యచ్చవవీథిఁ గప్ప నదియాత్మపురాంగణసీమఁ జేరినన్. 56

గీ. అవటి కెదురుగవచ్చు ధరాధిపతులు, కామినీయుక్తుఁడై చేరఁ గ్రమమెఱింగి
దవ్వులనె నిల్వ నిజమణిధామ మొంది, రమణులును దాను సంతఃపురమున కరిగె.

ఉ. అంతట నాసురాంతకుని యర్మిలితమ్ముఁడు తాళకేతుఁ డ
త్యంతమహోగ్రహాముఖకహాకహనాదమహాట్టహాసవి
భ్రాంతసమీకశోకపరిపాకభయాకరకైకలోకదు
ర్దాంతవిరక్తనోపరగదాత్రితకేళవుఁ డొక్కయిమ్మునన్. 58

చ. కొలువుననుండి యింద్రుకడకు న్నర మంపినవాఁడు వచ్చినా
పిలువు మటన్న వేత్రధరబృందము తోఁగొని తెచ్చి ముంగల
న్నిలిపిన వాఁడు భీతియు వినీతియుఁ దోఁప దురాపకోపచా
పలమున హుంకరించు నిజభర్తకుఁ గేలు మొగిడ్చి యిట్లనున్. 59

క. దేవరప్రతాపగరిమకు, నేవెఱతుం గాని నిర్జరేంద్రుఁడు వెఱచుం
డావంతయైన నిపుడే, మోవింతలుపుట్టె దనుజమూర్ధన్యమణీ. 60

సీ. దొరకాపులై కావ్యసరణిఁ దెల్పెడి కవీశ్వరులకు లంచపంచంబు లొసఁగి
సమ్ముఖమ్మున నుండి చనుదెంచు నల్వ్రాయసమువారి కాశపాశలు ఘటించి
బోనవెచ్చము గొంచుఁ బోవు శచీదేవిదాదులకును బరిధాన మిచ్చి
పిలువ నేతెంచు వేగులవారి వెంటనే యరుగు నియోగుల ననుసరించి
కినిసి వాకిటివా రడ్డగించుకతన, నేనువచ్చినమాట దేవేంద్రుతోడఁ
దెలుపు మని యెంత వేఁడినఁ దెలుపరైరి, విని వినమిచేసెనో కాని వేల్పుఱేఁడు. 61

క. మనగురు వఁట నేవచ్చుట, వినెనేమో గ్రుడ్డికంటి వేలుపుదొరతో
వినిపించి యతని యనుమతి, ననుఁ గొని చని సమ్ముఖమ్మున న్నిలుపుటయున్. 62

సీ. ననుఁ గని పాట నిల్పినతుంబురుని జూచి యాతాన మీసారి యనుమటంచుఁ
గమలజోద్భవ సుమాళము చెందినాఁడవు వింతవార్తలు గలవే యటంచు
నీతని నంపరాదే యంచు సన్నగాఁ దెల్పునారలను గద్దించుకొనుచుఁ
గ్రేఁగంటఁ బల్కనూంకించు నగ్గని పట్టుగద్దిగ లెస్సాయెగా యటంచు
సద్దసేయక నిరుపమైశ్వర్యగర్వ, పటిమ పడఁతులు జలకంబు పట్టియున్న
దనఁగఁ గట్టికవారింప్ల కనిపికొంచు, యంచఱు నటంచు మోయ నయ్యాసనమున.

గీ. మనగురుఁడు చేరి ననుఁ జూపి మనవి గాఁగ
నితని పీఁట గొల్పుఁ డన్న దేవేంద్రుఁ డొద్ద
నున్న గీష్పతిఁ గని కనుసన్న సేయ
నతఁడు నాదిక్కుఁ జూచి యనాదరమున. 64

క. ఏమోయి తాళకేతుం, డేమని పంపించె నిర్జరేంద్రుని కడకు
ద్దామక్షేమావహతసాం, గ్రామికుఁ డాతనికి శుభమె కదయని పలుకన్. 65

గీ. చఱచుఱను జూచి దొరనిన్నుఁ జూచువాఁడు, నంతలోనను నీవు నన్నడుగువాఁడ
వాబలా పొట్టక్రొవ్వు గాకంచు నేను, గోత్రపరిపంథితోఁ గొసరుకొసరులేక. 66

క. తారారంభలు చక్కఁగ, వారనఁగా మెచ్చి దనుజవల్లభుఁడు నినుం

చేసుకొని వేఁడుము నన్నుఁ, డారమణుల నొప్పగింపు మటుగాకున్నన్. 67

సీ. అలవాటు చేసికొమ్మఖిలమునుత్పాలకులఁ గూడికొని సిల్వోలువ్వోకును
నభ్యసింపఁగఁ జేయు మలజయంతునకు వేళ యెఱింగి వెండికాలాచి దాల్ప
దారికిఁ దెచ్చుకొమ్మారూఢిఁ బౌలోమి సైరంధ్రికాసదాచారమునకు
నలవడఁగా నేర్ప మచ్చరలకు మాఱువలుకక బోనిసపాటులకును
దలఁపకమృతంబు వైజయంతంబు మఱవు, విడువు వజ్రాయుధముతోడిగొడవ యింక
నిచటనుండక వెడలి ర మ్మిప్పుడు త్రేవ, పట్టనం బేను దోరణకట్టినాఁడ. 68

క. అని నీల్గు నన్నుఁ జప్పకఁ, గనుఁగొనలం గొప్పనిప్పుకలు కుప్పలుగాఁ
గనుఁగొను ప్రథమునకుప్పోఁ, గని దేవగురుండు రోషకలుషేక్షణుఁడై 69

క. ఓరీ మీదొర గోరిన, తారారంభలవిటావతంసులచేతన్
మీరజనీచరుఁ డగ్రజుఁ, జేరంజనుఁగాక యని వచించుచు నలుకన్. 70

గీ. వీనివెడలంగఁ ద్రోయుఁ డివ్వీటికోట, దాఁటునందాఁక నను మాట నోటనుండ
నీటు వోమీటి గరువంబు మాటి యిటకుఁ, బెద్దపర్వాన వచ్చితి బెదరువుట్టి. 71

క. ధారాధరవాహను గ, ర్వారూఢియు గురునిశాప మటులుండేఁ గదా
మీరజనీచరుఁ డగ్రజుఁ, జేరం జనుగాక యనుటఁ జెందితి వగలన్. 72

క. పాతాళకేతుఁ డాదృఢ, దైతేయుఁడు వీఁడు డమ్మదాలసకొఱకై
యేతెఱఁగున నేమయ్యెనొ, కో తెలియ దటంచుఁ దెలిసికొను నట్టియెడన్. 73

గీ. ఆరితేఱిటిల్లఁ గొందఱు చారవరులు, వచ్చినతిసల్పి కువలయాశ్వక్షితీంద్రు
చేత నైనట్టి పాతాళకేతు పాటు, తోఁపఁదెల్పినఁ దాళకేతుండు కనలి. 74

చ. ఒదవినశోక మాచికొని యుగ్రతరాగ్రహకేళికావశం
వదుఁడయి యింద్రు గెల్చుటకు వచ్చిననే మటుమీఁదఁగాదె నేఁ
డదయత నన్న రేఁద్రుఁడు మదాలసకై కద భాసమానదో
ర్మదుని మదగ్రజుం బిలుకుమార్చెను దాని హరింతు నిత్తఱిన్. 75

గీ. కపటమునఁ దెత్తునాహంసగమన నదియె, ఱింగి మార్కొన్న నాతని భంగపఱతుఁ
బగయడంపక యున్న నీపగిది నెగులు, సైఁచవచ్చునె యిదియ నిశ్చయ మటంచు.

సీ. ఎదురిండ్లు పలుసాల లెనసి వర్ణింపఁజాలిన మేలిపర్ణశాలికలు కొన్ని
యాగమాంతంబుల యందలి యర్థము ప్రకటించు కీరశారికలు కొన్ని
హవిరన్నసంభృమద్ద్విజకోలాహలాంకము లైన యాగవాటములు కొన్ని
దున్నివిత్తకపుష్టి యెన్నుల ద్రేఁగున వ్రాలు నివ్వరిప్రాలచేలు కొన్ని

తోఁపు లొకకొన్ని తెలినీటిదొనలు కొన్ని, కొలఁకు లొకకొన్ని పెంపుడుపులులుకొన్ని
మొదవు లొకకొన్ని చేమంతి పొదలుకొన్ని, బెరయఁగఁ దపోవనంబుఁ గల్పించి యపుడు

గీ. తోడిదైత్యులు శిష్యులై కూడి నడువఁ, బేరు ముండవ్యుఁ డనుచుఁ గల్పించుకొనుచు
గొన్నిమాయలు మదిలోన నెన్నికొనుచుఁ, గువలయాశ్వుని పట్టణ క్షోణిఁ జేరె. 78

ఉ. అంతట పౌరసారసదళాక్షు లుదారవిహారసౌధయూ
థాంతము లెక్కి కంటి రటవమ్మ మునీశ్వరుఁ డొక్కఁ డిమ్మహీ
కాంతునిఁ జేరి రాక్షసనికాయము చేత మదీయయజ్ఞమా
ద్యంతముఁ గోలు పోయితి నయా యని శోకొనిపోవుచందముల్. 79

ఉ. నిన్నఁ గదమ్మ గాలవమునిప్రభు వెంబడి నేగి రక్కసు
న్వన్నియమార్చి రాచిలుకవంటి మదాలసఁ దెచ్చి యుద్వాహో
భ్యున్నతిఁ గోరి నేఁటికి ముహూర్త మటంచును నిశ్చయించె నీ
యెన్నిక చిన్నవోవఁగ ఋషీశ్వరుఁ డెక్కడవచ్చె నక్కటా. 80

సీ. తలవాంచి బెళుకుఁ జూపులు క్రేళ్లుతుళ్లఁగఁ దెరమొఱంగుననిల్చు నొరపుఁ జూచి
చెలికత్తె చేమెచ్చవలెనన్న సిగ్గుతోఁ దలఁ బ్రాలువోయు చిత్రముఁ జూచి
వ్రేలిమిఁ జెమరించు కీలనంటెడు లాజ లందిచ్చునట్టి సోయగముఁ జూచి
కులదేవతకు మ్రొక్కఁ గొను వేళఁ దన పేరు వలుకఁ గొంకెడు ముద్దుబాగుఁ జూచి
ముచ్చటలు దీర్చుపూనిక వచ్చియితనిఁ, దోడుకొనిపోవుచున్నాఁడు దుడుకుఁదపసి
యతని మాటకు మాఱాడఁ డయ్యొ యీతఁ, డిందుముఖి ర్యాజులకు సౌఖ్యమేడదమ్మ

క. దొర నయ్యెద నని కోరుకు, రరయఁగ జను లెవ్వరైన నాపెను బెడ ద
ల్పరికింపరు దొరతనపు, స్సరవు ల్మతికత్తిమీఁది సాములు సుమ్మీ. 82

సీ. మంత్రుల మర్మకర్మము లెఱింగెడు దారి కోటలు కాపాడుకొనెడు నేర్పు
తతికాపు చెడకుండ సరిగోరుకొనుకీర్తి యీతిబాధలు చెందనీని సొంపు
పరుల యాలోచన ల్పరికించు గరిమంబు నర్థార్జనముమీఁది యాపరంబు
వేఁటతోఁటలమీఁద విలసిల్లు నాసక్తి యొడ్డోలగం బుండు నొప్పిదంబు
తగిలి పిరుహీఁకు సేయు నుద్దండవృత్తిఁ, జెలఁగుటయె కాని మనసు వచ్చినమిటారిఁ
గూడి తమిమీఱ సయ్యాట లాడికొనుచు, నడువఁ గూడునె మేదినీనాయకులకు. 83

క. అని యాడికొనఁగ మాయా, ముని వెంబడిఁ గువలయాశ్వమున్నాకిరయం
బునఁ జని యారాకొమరుఁడు, గనియెం దత్పర్ణశాలికాప్రాంగణమున్. 84

గీ. అంత నమ్మాయతపసి యయ్యధిపవర్యుఁ, గమ్రపద్ములఁ దుమ్మెదదిమ్ముఁ దోలి

మాన్మరపుఁ బుష్పాళుల్ నెమ్మిగ్రమ్మరించు, తెమ్మెరలు గ్రమ్మ కమలాకరమ్ముఁ జేర్చి

గీ. అధిప నీవింక వచ్చిన యప్పుడెల్లఁ గా, రక్కసులమాయ పద్మాకరంబునందు
వరుణజపమొనరించి యేనచ్చు ననుక, నిచట నుండంగవలయు నీవేమి యనక. 85

గీ. అయ్య నినునమ్మఁ గూడ దేనరుగు దేరఁ, దామసంబైన జరగెన వేమొ నీవు
కాకయుండిన నిమ్ము నీకంఠహార, మిప్పు డన చిన్నినవ్వుతో నిచ్చుటయును. 86

క. జలదేవతకుం బ్రాంజలి, సలుపుచు నక్కొలన మునిఁగి జనపతినగర
స్థలమున నంశిపురంబున, నలరుం బొవచెంత డిగ్గియుండేలుటయున్. 87

గీ. కుండలియుఁ దానునవ్వమఁ గూడియున్న, యమ్మనాలసఁ గని మంత్రియందమొంది
యమ్మనరాజు హాని గూగమ్ముగాచె, రక్కసులఁ దోలి భుజబలప్రాభవమున. 88

ఉ. అమ్ముని యంత సంతసము నంది యనిందితకార్యధుర్య యా
ధమ్ముగ నీవివాహమునటం జరగింపఁగఁ గోర్కె వేడ్క యీ
యిమ్మునఁ బట్టనంబు రచియించె పనాదు తపోబలంబునం
గొమ్మను బిల్వ బంపు మిటకు న్నను మాటలు పల్కె కేమియున్. 89

గీ. అనిన మాటాడ వెఱచి యమ్మనుజనాథుఁ, డానవాలుగ నీకంఠహార మిచ్చి
నిన్ను వేవేగఁ దోడి తెమ్మన్న వచ్చి, నాఁడ రావమ్మ కుండలతోడఁ గూడి. 90

మ. అనియామాక్తికహార మిచ్చుటయు సాంద్రానందముం బొంది మా
సిని మేకోలునఁ గుండలావదనము న్వీక్షింప నయ్యంబుజా
నన కానిమ్మని పల్కఁ గన్నత్రిమవిమానం బెక్కఁగాఁ జేసి య
ద్దనుజాధీశుఁడు తానదృశ్యుఁడయి చెంతంబోయె సంతుష్టుఁడై 91

వ. అత్తఱిం దటిత్తరుణభానువిరాజమానం బగు నమ్మాయావిమానంబు జల్లుయంత్రంబును పముఁ బ్రవేశంబునకుం గమకించునందకంబురకంబునఁ బొడవుగా నెగిరి యొక్కపరిరథంబువిధంబున మండగతిం జనుచు నొక్కసారి లకోరిదారి రివ్వన నిగుడుచు నొక్కతేప బొంగరంబు రంగున బిఱబిఱం దిరుగుచు నొక్కమాఱు గాలిపటంబునీటున నసియాడుచు నొక్కయెడఁ జుక్క తెగిపడ్డ విధంబున డిగ్గుచు నొక్కచోటం బుట్టచెండు వడువున నుప్పరంబునకుం బోవుచు నొక్కవంక జీనుదిగనైచిన కప్పలి చొప్పునఁ గదలక నిల్చుచు నొక్కపరి బైరిడేగ యొయారంబునం దిర్యక్ప్రచారంబుఁ జూపుచుఁ బోయి మేరుధారుణీధరంబున నిబిడాంధకారబంధురం బగునొక్కబిలంబున దమాలతాలతక్కోలరసాలసాల ముఖసాలవిశాలం బగు వనంబునం బునఃపునర్వర్ధమాన గిరిఝరీవితానంబులను నుబ్బగన్పించు పన్నీటిపిల్ల

కాలువలవలం బ్రోదిసేయు జాదివిరిదేనియవాక వెంబడిం బాదుకొనిన పోఁకమ్రాకు లఁ కట్టకడపట నెట్టుకొనిన యిందుకాంత వేదికాబృందంబులతోడి గురివిందపందిళ్ళ నారసికొనియున్న తిన్నని మగటాతినన్నియలఁ జెన్నగు చవికల నమరుకొన్న కన్నెసుపొన్నగున్నలఁ బెనఁగొన్న నవబిరుసజాతికి నాధారంబగు గొప్పకెంపుల జబ్బ చప్పరంబులం గప్పికొన గజ్జుమావులక్రేవలఁ దమ్మిత్రావులవలం దావులైన తెలినీటి కేళాకూళినంటికొనిన యావంతులవలం దొరఁగు కప్పురంపు రవలుం బోలు కోలువుకూటంబు డిగ్గిచను మెట్లవగ్గలు నగ్గలంబగు నీలంబు నిగ్గులు గగ్గోలుపడు కోనపాదిరింగ గొఁగిలించిన పొగడగుంపుల నట్టనడుమఁ బట్టుగఁ పొదరిండ్లఁ జుట్టఁబడియున్న బిత్తరంబగు క్రొత్తముత్తియంపుఁ బడుకటింట నపరంజిగోలుసులం జెలంగు తూఁగుటుయ్యెలచేరువనుం జని యద్దనుజవిభుండు నిజాకారంబుతో నయ్యెద్దఅం దగ్గృహంబున నుండియుషోఘోరాకారలగు దైతేయభామలం గాపు పెట్టి కృతకృత్యుండుంగాఁ దలంచుకొని యాక్షణంబున. 92

చ. మునుపటిపారికాంక్షి వినయుం భజియించుచునంబుజాకర
బునఁ బడి తేలియాడ్పుపతిపుంగవ నీభుజసారగౌరవం
బున బపమ్మెల్లఁ జీరిఁ బోలిపోనక నీదికిఁ బట్టిపట్టులం
బునఁ కయి పొమ్ము రాజునకుఁ బోలునె యాశ్రమవాసఖిన్నతల్. 93

చ. అని యనుపన్ హసాపని నృపాగ్రణి యమ్మునిలోకచంద్రు వీ
డ్కొని తనతేజి నెక్కి గిరికోటులుఁ గాననవాటులు న్మహో
జనపదము ల్నదంబులును జయ్యనదాఁటి పురంబుఁ జేరి కాం
చనసనుమార మై తగుహజారమునం దమవారు చేరఁగన్. 94

క. తురగంబుడిగ్గి యచ్చటి, పరిజనుల న్వీడుకొల్పి పార్థివచంద్రుం
డరిఁగి గృహాంతరమునఁ దన, తరుణీమణి లేమి నగ్భ్రాంతసమగ్నుండై. 95

ఉ. అక్కట యెందువోయెనో మయూరపు సంచులముద్దుగుమ్మ యే
చక్కని దాఁగెనో కలికి చక్కనలెక్కనగుబ్బలాడి యే
దిక్కున నున్నదో సొలపు దేఱడిచూపుల హొంతకారి యే
యిక్కన నిల్చెనో యొరపు నీనెడు చిల్కలకొల్కి దైవమా. 96

ఉ. ఆనన లామెఱుంగుఁ దొడ లాకదళంటన మాచునోయుగం
బానెదు లామిటారి తెరు లాముఱిపంబునఁ బల్కుపాటవం
బానొన లా [illegible] లా తెలివర్యోవ చక్క[illegible] జేర్చుపాం

పేనలినాక్షి కైనఁ గలదే కలరే యిటువంటి కామినుల్. 97

సీ. గిలుకుబంగరుపుట్టియలు జాఱఁగాఁ జక్కనలవరించెద నంచునిలిచినిలిచి
బయట నున్నది చిల్కపంజరమున నుంచి మఱివచ్చెద నటంచు మరలి మరలి
యతివ యల్లపుడేమి యంటివే యేచిరాకయియుంటిఁ దెల్పుమం చడిగి యడిగి
చెమటచేఁ దిలకంబు చెదరెనో యని వింతసొలపుతో నద్దంబు చూచి చూచి
ప్రొద్దు గడపుట కని తోడి పూవుఁబోఁడు, లదరనై వంగఁ దనమందయానగరిమ
యినుమడింప మదీయమోహనగృహంబుఁ, జేరు టెన్నఁడొ యానీలచికుర నికర. 98

శా. కైజాచేసినబొండుమల్లె విరిబంతిఁ గాజగాజోదు తే
జోజాలం బలవాంచి బోఁటిచెఱఁగుం జేఁ గట్టిగాఁ జుట్టి ను
న్గాజుం గంబము చాఁటున న్నిలిచి క్రేఁగంట న్ననుంజూచు నం
భోజాతాక్షిని నెజ్జకుం దిగుచు నేర్పు ల్గల్గునే మీఁదటన్. 99

క. ఎక్కడి యాలోచన యిది, యక్కట యిక్కలికి యున్నయప్పటికిఁ గదా
యిక్కోరికియని ననవి, ల్మొక్కలిదొరవిరిలకోరి మొనకుం దలఁకున్. 100

సీ. పొడఁగనవచ్చు నాప్తులవేళఁ గాపంచు నవసరంబులవార లడ్డగింపఁ
బనిగల్గియుండినఁ దనకు మంత్రులకు లేఁజిగురుఁబోఁడులచేతఁ జీట్లు నడువ
నిదియేమొ కడువింత గదయంచు నవరోధబిసరుహాక్షులు గుసగుసలువోవఁ
గొలువుకూటమునందుఁ జెలఁగెడు సింగంపుగద్దియగవిసెన గైకొనంగ
బొక్కసంబులు కైసబీగములు భజింప, నుడిగములవారలకు నాటవిడుపు గాఁగ
నోలమును మాని మేదినీయువతిజాని, యింతి భావించు నంతఃపురాంతరమున. 101

క. ఈకరణి నన్నృపాగ్రణి, యేకరణీయములు మాని హిమకరవిలస
ద్రాకలకు నొలిదెమ్మెర, రాకలకుఁ జాలిగొని విరాళిఁ బడంగన్. 102

ఉ. ఆతని నెస్తగాండ్రు భుజగాత్మజు లవ్వగ లెల్లఁ గాంచి య
య్యో తమవంటివార లిటు లుండియు నీదొరసీ దురంతచిం
తాతనుతానితాంతహృదయవ్యథఁ గుందఁగ నూరకున్న సం
గాతులమౌదుమే యిపుడుగాక మఱెప్పటికీ వయస్యతల్. 103

క. అని యయ్యిద్దఱుఁ జని తమ, జనకుం డగునశ్వతరుని సమ్ముఖమున న
జ్జనపాలువిరహవేదన, వినిపించి తదార్తిఁ మాన్పవే యని వేఁడన్. 104

చ. తనయులస్నేహబాంధవవిధానము లెంచి నరేంద్రుఁ డంతమా
ఘనుఁ డటువంటివాని కుపకార మొనర్చినఁ గీర్తిఁ జెందదే

యని రజతాద్రికిం జని నగాత్మజతోఁ జదరంగ మాడు రు
ద్రుని గని మ్రొక్కి కుంభలిపరుం డటు నిల్చిన నావరంబునన్. 105

గీ. అంబికయును నితం డెవ్వఁ డనుచు నడిగి, యధిపుఁ డశ్వతరుండు గాఁడా యటన్న
నీతఁడా యశ్వతరుఁడు సంగీతవిద్య, దొడ్డవాఁడఁట యనిన రుద్రుండు చెలఁగి.

క. వెనుకం బురుహూతు దెసం, దనతంబురవలన గెలిచె నానాగతుల
న్మనతుంబురు నీవెన్నడు, వినవంబురుహాక్షి నేఁడు విను మనిపలుకన్. 107

గీ. మంచిది సగటుపైని దె మంత్రికావ, లున్న దీచదరంగ మిట్లుంపనిమ్ము
వెనుక నాడుదమని సతి వనజనయన, యభిముఖంబుగఁ గూర్చున్న యవసరమున. 108

గీ. ఔర నారాక ఫలియించె నంచు నెంచి, యచటఁ గూర్చుండి యయ్యురగాధినేత
గపిసెన సహస్రి తంబుర కలికిపైఁడి, బిరడలు బిగించి శ్రుతులెల్ల సరిగఁ గూర్చి. 109

క. రంకాళశశాంకవదన ప, రంకా యిటు నీకు మ్రోల రహి గనిపింపన్
నాకుఁ దరమూనె సైసం, గాకుండిన నీకు ముద్దు గద యని యంతన్. 110

సీ. శ్రుతి తోడఁ గూడి మెచ్చులు రాసిజంబుగ సంచునంపగ నాలపించుసొంపు
గళియు మైనను గుక్క విడువక హరోయలుగా నవగడంబుగఁ దానము నెసు నేర్పు
పరరాగముల వింత సౌరనీక వ్యాప్తిమై మించుగా రాగంబుఁ బెంచు వింత
తాళంబు తప్పక తనువు గదల్పక బాగుమీర పదంబు బాడుదారి
ఎదనెదఁ బరాకు వినుదను హెచ్చరింపు, మీరు మెచ్చిన యీవిద్య మీరొసంగు
నట్టిదని గర్వపరిహార మలర నతఁడు, గాణ వపువనశుద్ధమార్గము నటించి. 111

గీ. గోటి వాద్యంబు కిన్నరమీటు బడ్డి, వాద్యము రబాబు వగలుసర్వంబు మెరయ
దురు సుగతి జూపఁ బార్వతీ తరుణి మెచ్చి, జాదు సరిగంచు పయ్యంటఁ జక్కఁ జేర్చి

ఉ. ఎక్కడి నారదుండు మఱి యెక్కడి తుంబురుఁ డోగిరీశ యే
దిక్కననైన నీవిధము తేటపడం గనుఁగొంటలేద యే
పెక్కన తప్పనంచుఁ గనిపెట్టుక యుండితి మొదుఁ గానమ
మ్మక్కళబాసు మేలు హావుసంచు ఫణీశ్వరుఁ జూచి యింపునన్. 113

క. వరమడుగుమనిన గంగా, సరసిజముఖి యీసుతోడి జంకెనచూపుల్
బొరసిన మొగంబుఁ ద్రిప్పెం, గిరిజకు డెందమున వింత కినుకజనింపన్. 114

ఉ. అమ్మక చెల్ల యెన్ని వగ లద్దిరనాయకుఁ డొద్ద నుండఁగా
నెమ్మెలు గాక యేను వరమిచ్చెద నంటి వి దేటిమాట దో
సమ్మనుమీ నఘుఁటులను జన్వని నాథు నమజ్ఞ లేక యే

కొమ్మని యీఁగఁ జెల్లునె యశంసిత చాతురి గల్గియుండినన్. 115

గీ. అని పలుక, నెంత లేదామృగాక్షిమాట, వినకు మఱుగుము వరమిత్తు విభుఁడుతనకు
నంతఁ జనువిచ్చినాఁడన నవ్వుఁబోటిఁ, జుఱుకు చుఱుకునఁ బాఱఁజూచెనపుడు. 116

చ. ఉరగవిభుండు లేచి కుధరోద్భవఁ గన్గొని యమ్మ మేదినీ
వరుఁడు ఋతధ్వజుండు భుజవైభవశాలి మదాలసాసతిం
బరిణయమాడునంచు నిజమందిరమం దిరవొందఁ జేసి త
త్తరుణి వయస్యఁ గుండల వితావితఁ గారక వంతఁ గుందెడున్. 117

గీ. వారి నిద్దరి రప్పింపవలయు ననిన, గిరిజ, కానిమ్మనంగఁ దత్సరసిజాక్షి
కాని కుండల రావంచు గంగ పలుక, నభవుఁడిద్దరియందు మధ్యస్థుఁడగుచు. 118

గీ. మంచిదహిరాజ రెండునాళ్ళించుమించు, గాఁగఁ గుండల చనుదెంచు గాక యిప్పు
డమ్మదాలస వచ్చు నీవలుగుమనిన, నదియపదివేలుగా నెంచి యాతఁ డటేఁగె. 119

ఉ. అంతటిలోననే యలమదాలస నిద్దురవోవ నయ్యమా
కాంతుఁడు మాయచే నురగకన్యగృహంబున నిల్పె నాతఁ డ
త్యంతము సంతసించి తనయాత్మజగా నురరీకరించి య
య్యింతిని గొల్వ నెవ్వరు మృగేక్షణల న్నియమించి యత్తరిన్. 120

చ. తనయులఁ బిల్చి మీరు వనితామణి వచ్చిన మాటఁ దెల్పక
జనపతిఁ దోడితెండనఁ బ్రసాదమటంచును వారలేగి గ్ర
క్కున నడిగంపుఁ జేడియలు కొందఱు గొల్వఁగ నున్న భూవరుం
గనిన నతండు నిండు కుతుకంబునఁ జేరువ నుంచి యిట్లనున్. 121

ఉ. ఇన్ని దినంబు లంబుజవనీశుఁడు చెందొవయిండ్లలోన ర
క్కొన్న మదాళిఁ బద్మగృహకోటికిఁ బొమ్మని తీవరించు నం
తన్ననుఁ జేరవత్తురుగదా యొక యామము వోవుదాక రా
కున్న తెఱంగు మాకు విన యోగ్యము యేని వచింపుఁ డింపుగన్. 122

క. పరబల ఖండన మంత్రా, చరణమొ గృహకృత్యగత విచారమొ కాకో
వరపుత్రులార మీ, రిట కరుదేరక యుండ నాఁగినది యెయ్యదియో. 123

చ. అనుడు భుజంగరాజసుతు లట్టివి యేవియులేవు లెండు మా
జనకుఁడు మీగుణంబువిని సంతసమంది మిముం గనుంగొనన్
మనమునఁ గోరి తాన పయనంబయినన్ వలదా యిలాబలా
రిసదొడిఁ దెత్తునంచు వివరించుటకై తడవుంటి మిత్తరిన్. 124

క. ఆతీరునఁ బలుకఁగరా, దో తెలియదు గాని శౌర్యధూర్వహనీసం
ఘాతముచే నీమన్ననఁ జేతం దోడి తేరఁ బ్రతినఁ జేసితిమనుఁడున్. 125

క. మాయురె తా రావలెనా, యీయెడకే నరుగుదెంతు నాయిల్లనఁగా
నీ యిల్లనగా వేఱా, వోయఁగ రా విట్టులైన భువి సఖ్యంబుల్. 126

మ. అనుచుం గట్టికయుంతి దేవర పరాకయ్యా పరాకంచు బో
రన మ్రోయన్ వలెవాటు కుప్పటి చెఱం గల్లాడఁగాఁ జేఁగటా
రిని లోభాగము నూఁది నిల్పఁదగు వారి న్నిల్పుచున్ మేలికుం
దనపుం గద్దియ డిగ్గి నిల్చె నురగేంద్రక్ష్మా దిదృక్షారతిన్. 127

చ. నిలచి పరావనీప రధి నీరధి మంధనమందరాద్రి య
బ్బలి యుఁ కంఠ పాప దొరపట్టులు తెన్నెతిఁగించు చులిపేఁగా
నలరుచుఁ జేఁగి కాంచె సికతాంచితతీరసమేతకేతకీ
తిలకగ చంచరీక సుదతీ కృత గీతిక గోమతీనదిన్. 128

చ. కనుఁగొని చిల్వరాచకవ గ్రక్కున నన్నదిఁ గ్రుంకఁ జేసి తో
డ్కొని చనఁ జేఁగి చూచె ఫణకోటి మణీఘృణి వేణి కోర్ధ్వ దీ
పనికర భూత్రపాచరిత పౌరుష కేళి విధూత రత్నరు
గ్జనిత నవస్మితానన భుజంగిక మొక్క పురంబు ముందరన్. 129

చ. అపటి వియోగిభోగి జలజాక్షులు మారుని వ్రాసి కోల్చి నో
నచలితభక్తిఁ జందురిని యందమెఱుంగమి మున్ వసుంధరా
రుచి గరుణావలోకులు వరుల్ చెలి నీ మొక మబ్జునంటివన్
వచనము లంతలోఁ దలఁచి వ్రాయుదు రున్ముకురాగ్ర వీక్షులై. 130

క. ఈకరణిఁ జూచి డిగునా, భూకాంతున కొక్కయింపుఁ బొడమించెను ద
ర్వీకర నైశాకర రు, చ్యాకర ముక్తానుషక్త హర్మ్యతలంబుల్. 131

సీ. తీవయుయ్యెల లూఁగు పూవుఁబోఁడులవీఁగు కొప్పుచీఁకటిఁ డాఁగు కోర్కి యొకటి
నును పుట్టచెండాడు వనితల యరవీడు జిలుగుపయ్యెదఁ గూడు చెలువ మొకటి
యలయరించ నదలించు చెలుల జంకెనమించు బెళుకుచూపులముంచు బెరికి యొకటి
పూవుబంతులు రువ్వు పొలతుల తెలినవ్వు కలికి వెన్నెల క్రొవ్వు గనుట యొకటి
గాని మఱియేమి వలదని కంకణంబు, గట్టుకొని సల్పుపతి దృష్టిఁ గ్రమ్మరించి
చలిదిగట్టించి త్రిప్పె నిస్తుల సువస్తు, నవ్యసంతోషకరమగు నాగపురము. 132

ఉ. ఇటు నలెఁ జూచుచుం జను నరేశను శేశయబాణు చూడ్కి న

న్నిటమగుడించె భోగి పరిణీ తరుణీ ఫణ ధోరణీ నవా
ఘటిత మణీగణీభవపకంప ఘృణీత వియత్ప్రశంగ మో
త్కట ఝరిణీ సరోజ మతికారి సమేరు పవీర మారుతుల్. 133

క. అవ్వనముఁ జేరి మన్నవు, జన్వానవున్ రాచకొమరుఁ జల్లనిమంచుం
దువ్వారల నిర్వటిల్లెడు, పువ్వుంబొదరింట నునిచి భుజగకుమారుల్. 134

క. ఇట నుండు మేము నీవ, చ్చ్చట యురగేంద్రునకుఁ దెల్పి శోభనలీలా.
ఘటనాపూర్వంబుగ ని, చ్చటి కేతెంచెద మటంచుఁ జనుటయు నతఁడున్. 135

మ. వెలుఁగుల్గాఁదగు మిన్నతీవియల దీవిన్ రాయు పన్నీటికా
ల్వల తుంపుర్లకు మారు గాఁబలెఁ జలద్వాసంతికా నూన ని
ర్మల మారందకణాళి జారి తనపై వ్రాలంగ రాయంచ ఱె
క్కలు ఝాడించినఁ గ్రమ్ము తెమ్మెరల రాకన్ హాయి మించున్నెడన్. 136

చ. హడపము వీణ కిన్నెర హిమాంబువు నించిన గిండి చల్వపా
వడలుఁ గురంగనాభియు జవాదియుఁ బట్టుపునుంగు వీవనల్
ముడి విరులద్దముల్ సురటులుం దెలిపంతపు దవ్వొనల్ ముపం
బడర ధరించి యూడిగపు టబ్బురపున్ వలిగుబ్బెతల్ దగన్. 137

సీ. జిగిచాలు దగుకీలు చిగురాకునకు బ్రాఁకు కలికి కోయిలలకుఁ గాలు పనుప
నెలగోవగలమోము తెలివమ్మిఁగల తుమ్మెదలకు నమ్మిక కమ్మలలవరింప
నెఱికప్పుఁగను క్రొప్పుఁ నెరిమబ్బునకు నుబ్బు నెమలికిఁ ద్రోనబత్యములననుప
నునుమోవి పైఁదీవి మును బింబ నికురుంబములకేఁగు రాచిల్కకొలివులియ్య
లెనగవు డాలు కైదండ పూను చూపు, తళుకుచే గ్రొమ్మొక్కఁ గొనెడు ముత్యాలరెట్ట
పేట పాపటబొట్టు తుంపిళ్ళు గుల్కియు, నచటికే తెంచె నొకచకోరాయతాక్షి. 138

సీ. కావలిఁ గనునింతి కానుకిచ్చినబంతిఁ గనుసన్న నొకకన్నె గైకొనంగ
దెలిచూపు గమి తారసిలుచు నిల్చిన యంతఁ బడతులిద్దరు బరాబరులు సేయ
నగుమోము జిగితమ్మి నిగుడు ఘర్మము గ్రమ్మి నంతుకై చెలువపావడలు దుడువ
తొలఁగు బంగరురంగు జిలుగు పయ్యెదకొంగు సకియ యొక్కతె చక్కసవదరింప
కట్టిక మిటారి మొకరి చెల్కత్తెగములఁ, బొడఁగనఁగఁ జేయు బంగారుపొంతె మెఱుఁగు
టరిగె గుంపుల నీడ నొయ్యారమెసఁగ, వచ్చి పుష్పాపచయకేళివాంఛ దేలి. 139

క. మడమఁబడు నిడుదవాలిక, జడ నడుమున జుట్టి పైట సరిగె చెరంగుల్
బెడఁగుఁ జనుదోయి పొసఁగ లే, ర్వడ బిగియింపుచు ననుంగుఁ బడతులు గొల్వన్. 140

చ. చిలుకలలోన చిక్కులయి చెల్వపుటంచల లోనవంచలై
తెలివిపొసంగు తీవియలఁ దీవియలై సరసంపుఁ బల్కులన్
గులుకునడల్ పసిండి తలుకుల్ గలమేనులు గానుపింపఁ జే
తుల కసివోవఁ దేనియలతో ననతోయములెల్ల గిల్లుచున్. 141

సీ. కలిగొట్టుఁ జేరబో కళి గొట్టు సేయునీ బీరమేమిటికి జంబీరమదిగో
సింధువారము తెనె సింధువారములేని పైరుగాఁదేఁటి కింపై రుచించుఁ
జూతము పదరమ్మ చూతము మపవతీగానంబు లచ్చోట గానరావె
రమ్మ మారుని గుడారమ్మ మారు నిజమ్మ గుంపుకోటుల గుజగుంపులేల
యీరమా యీరమానీతి యీప్రసూన, వాసనల్ వాసనల్ వంకనందికొనఁగ
పాటలాపాటలాళిచేపడియె ననుచు మాటకే మాటకేమిలేమూవివిరులు. 142

క. అని జవ్వను లవ్వనిఁ గ్రొ, వ్వునఁ బువ్వులు గోసి కడు దవుల్కొను నవ్వుల్
నన రువ్వులు కొంచెరు మెచ్చనిచివ్వలు నివ్వటిల్లఁ జని యవ్వలనన్. 143

సీ. కంబముల్ గాన నిల్కడఁ గన్న పోఁక బోదియలపై వడిగాగ దీటుకొన్న
యలదీవ చాలు వాకిలి సొచ్చి లేమావి గుమురుల క్రీనీడఁగొప్ప కెంపు
లలితంపు మెట్లఁ గేళాకూళికవ్వల జలయంత్రములవీఁగుచలువగాడ్పు
గదియంగఁ గలువ మేల్కట్టు పూవుల గప్పు సాంబ్రాణి దూపంపుజలదపాళి
నరసిఁ బురివిప్పఁజను నెమ్మి నాస గలుగు, దాని గాఁజేసికొనెడి చిత్తరువుబొమ్మఁ
జిలువచెలువంపు జడ గుంపు సొలపు నింప, నీఁడుగాననిరియొకచిన్ని మేఁడమీఁద.

క. చెలువైన పసిడిగద్దియఁ, గొలువై నలువంకఁ జెలువ గుంపులుగొలువన్.
బలువైఖరి పావడ నెల, తలు వైవఁగఁ గన్నెయున్నతఱినటమున్నన్. 145

శా. ఆజన్మస్థిర ధర్మకర్మ నిపుణుం, డౌరాజు రాచిల్కమే
త్తేజీ జోత్తేదొక పొంతకాఁడయి తనుం ద్రిప్పంగ నయ్యాంతి య
య్యోజన్ వచ్చుట గొలెఁ బూపొదలలో నున్నట్లువీక్షించి యా
రాజీవేక్షణ వెంటనంటఁ జని గారామార సౌధస్థలిన్. 146

క. వలభిన్మణిగణగుంభిత, వలభిం దద్రుచి తమంబు వలఁగొని పొదువన్
జలదాచ్ఛాదితుఁడగుత, మ్మలదాయ యనంగ నిలిచి ముదితం జూపన్. 147

శా. ఏకైకాంగవిలోకనాకల నతుష్టై కాంతసామంత భా
వాకూతంబులు తద్విధాత్మరచనా త్యాశ్చర్య గాఢాప్త మూ
ర్ధాకంపంబులుఁ దత్సమానకృత మానాధీన నానావచ

శ్రీకంబుల్ మహిపావలోకములు నారీమౌళిపై వ్రాలుచున్. 148

చ. అలికచ కావిమోవి శెపఁగానెడు తేనియ సోనవానలన్
నిలిపి శరీరకాంతి ఝరిణీ పరిణీ తమ్ములై కుచాచలం
బులఁదప మాచరించుచును మున్ను వరోరువిలాసిరంభతో
గలసిన కొంవుపో విభుముఖంబుఁ గనున్ నృపవీక్షణావలుల్. 149

క. మినుకు చను గుబ్బగుబ్బలి, కొనముండ్రియు గాఢనాభికూపంబునఁ గ్ర
క్కున దుమికి నెలవు మఱఁగను, గొనమిన్నప్రుచూపులుద్ధురుడుచు మ వెదలెన్.

గీ. కలికిలేగొను నిలువెల్ల కల్లయగుట
వైస నదృశ్యాంజనంబు సెవించెనేమొ
నెగడపటులయ్యుఁ బతిదృష్టి నెనుకఁ దొడఁగ
వెలచువారలఁ గనుఁగొన్న వెంటఁ బడరె. 151

క. ఈనటనఁ జూచి నివ్వెఱ, గానఁ బడెన్ రాజహంస గమనాదృతిచే
మానసము మానసముగా, నానరపతి యతిశయప్రియంబు దగంగన్. 152

సీ. శాబాసు ననచెండు జిగిఁ జెండుచనులొందు గబ్బిగుబ్బలిచాలు గొబ్బఁ జాలు
హాయిసరే నెఱిమించు నవలించుకనుమించు కమ్మపమ్ములమేలు గ్రుమ్మఁజాలు
చాగురే విరిపువ్వు సరిరవ్వు చిరునవ్వు తొగరాచ జిగిజాలుఁ ద్రోవఁజాలు
మాయురే యళిపెంపు మరపింపు నెరిగుంపు మేలినీలపుడాలు నేలజాలు
మెలుసంపంగి దండ్లలు డీలుపఱచు, కెలునునుపూలతీగెల వ్రీలజాలు
వాలుగల డాలు దొరచేతి వాలుకలువ, వాలుగాబోలుఁ దలఁప నీవాలుగంటి. 153

చ. అనికొని యాడి చేడియ నొయారపు రాశిని జేసినట్టి య
వ్వనజజుచేతికిం బిరుదు వైవఁగవచ్చుఁ గదయ్య దీనిప్రా
పున ముద మొందు కెందలిరు బొందళపుందొర చూచు వారలన్.
వెనుకొని పూవుటంపరలఁ బెంపరలాఁడకు మన్నమానునే. 154

శా. ఔనేకా మునుపెన్నఁడో చెలియ చాయంజూచి నట్టయ్యెడున్
గాన స్వచ్ఛ మదాలసావయవ శేఖావైభవం బింత యే
లా! నామాన సమీలతాంగి పయి లీలాడోలికాకేళికా
శ్రీనైపుణ్యముఁ జూపఁగా హావణుఁగాంచెం దద్గుణాలంబమై. 155

మ. వరభామాంగము మించుఁగా నితరముం బాటించకే మన్మనః
సితహంసం బది మానసంబుగను రీతిన్ నాతి వీక్షింపుచోఁ

గరముత్సాహమునఁ జెందిపొంగెడు నదే కాదా మహాచిత్రమై
యిరవొందఁ జక్ మదినాకు నాకె వెరగయ్యెం గంటివే యిచ్చటన్. 156

క. ఇనప్పుడే మదాలస, గానోపుఁ జుమీ లతాంగి కాపుండినచోఁ
గానీ కాపుండదు బాలా, యీనిగనిగజిగులు గందుమే యెండైనన్. 157

సీ. మోముదాయయె కాదు ముద్దుపల్కులలోని తతితీపు మెడఁగుల్కు దానివగయె
మోవి కావియె కాదు మఱిపెంపు పెంపుతో నాను జంకెన చూపు దానివగయె
పలుసోయగమె కాదు పచ్చిదేరఁగ నాఁడు తరుణిపై బొమముడి దానివగయె
మోముచాయయె కాదు ముద్దుమాటకుఁ జెక్కులో నిండు లేనవ్వు దానివగయె
అన్నియును నాయెఁగా యీమృగాయతాక్షి, యదిగొ గూర్చున్న యంద్రవలీలాంబుజంబు
నలిని మొల్లము మూర్కొన్న చెలువుదాని, వగయె కానలె బాపురే వనజజన్మ.

క. అని సముపస్థు నిరీక్షణ, మునసరి సేయంగ బుద్ధి పొడమి తలఁచి యా
జనపతి రతివిపరీస్పృత మనమతిచంచలము గాఁగ్గ మఱియుండనలోఁ. 159

గీ. ఇది మదాలస యగునేని యిచట కెట్లు, లఱుగుదెంచెనో దీని ప్రాణంబులైన
యుల్లసుండల యిప్పుడే మయ్యెనొక్కొ, వీరికెపఁ బాయునలసెనో విధికృతమున 160

సీ. అలనాఁడు మందరాహార్యకందరభాగమునఁ గుంపఁగాఁ బలాశనకులాగ్ర
జాతుమాయాతి విఖ్యాతు భీతామరవ్రాతుని బాతాళకేతుఁ గూల్చి
ప్రమదంబుతోఁ దేజిపైకి రమ్మన నాలుగడుగులు పెఱుదన నఱుగుదంచి
యటు నిల్చి మురిపెంపు టల్లికసిగ్గుతో గోరలు కొంకునఁ బైట కొంగు నేల
నలమి యీ కాంత వింతదైన్యంబు నెట్టి, కొనఁగ ననుజూచి దానిఁ జూచిన నెఱింగి
వనితతోఁ గూడ దాని నావెనుక నుంచి, తోడితెచ్చితిఁ గాదె మత్పురమునకును. 161

ఉ. అంబరవీథిపైఁ గుపలయాశ్వము మీరి లకోరి కోలవే
గంబునఁ బోవ వెన్నువెనుకం దగుదాని వశంబు గాకరాఁగ
గంబునదాని మోవిపలుగంటొనరింపక దానిపాలభా
గంబునఁ జిందులాఁడు నలకంబులు దీర్పక మోసపోదునే. 162

చ. విడివడి దుర్వ్వనన్ గగనవీథికి గుఱ్ఱము చౌకళించినన్
వడకుచు గబ్బిగుబ్బల మొనల్ వెసవెన్నున నాఁటి రొమ్మునన్
వెడలఁగ గోలతుంగ భయవిహ్వలమై ననుఁ గాగలింప న
ప్పడతి మదీయ వేగ రసభంగ మొనర్చె భయంబుఁ దెల్పుమన్. 163

సీ. ఎనుబదోపలెన్నఁడు నేతెంచు మున్నె వారలఁ జూచి దవ్వు దవ్వులనె తిరుగ

దొరలు వచ్చిరటంచుఁ దిరుగు త్రొక్కాళ్ళ నియోగు లొక్కొకచోట నొదిగినిల్వ
నలయమాత్యులునిల్చుటరసి పాఱులను గంచుకిముఖ్యు మొకముఁ జూడక యెతలుమ
గట్టికవాని యాగ్రహవృత్తిఁ గని పౌరు లంతంత సన్నఁగ నడుఁగు దేర
నభ్రయానంబు వీడి హయంబు పురముఁ, జేర నీనారి తిరిగి యాచెలువ నడుగ
యదియు నావల్లఁ దెలిసి యియ్యధిపవర్య, కటకమని తెల్ప నడిగితిగాదె మున్ను.

క. అటువంటి కూర్మికత్తియ, కుటిలాలక నెపసె నేమొకో యదివిధి సం
ఘటనము గావలె నీవలఁ, గటకట యీకార్యమెట్లు గాశినఁ బడెనో. 165

క. అనిపతితలపోయఁగ నిం, పున వీణియలందు గీతముల్ పడిఁ బలికిం
చినగతి విన్నఁబడె నిద్దఱి, వనితల యన్యోన్యకలహ వాచాప్రౌఢుల్. 166

సీ. చనవరివలె నెందుఁ జనెదు వద్దములేక మాకును నొకయడ్డమా మృగాక్షి
యంతటి దొరసాని వగుదు వెవ్వతెవీవు, తెలియదే యింద్రునికొలువుదాన
నతనిఁ గొల్చిన వారలరయ నెందరులేరు వారిలో నెంచఁగం తారగానె
యిటు నిల్వ మెవ్వతె నైన నేమిభయంబు నిలువదీరదు పోవవలయుమాకు
యెంతవేగిర కత్తివే యింతికాన, మామగుపగొల్వ వచ్చితి మోమిటారి
యేరిఁ బోలుదు కొలిచినవారిలోన, సుదతి యాకారగరిమంబు చూచిపల్కు. 167

క. అనుకలకలంబు చెవిబడఁ, గనుసన్ననె యవసరంపుఁ గల్కిమిటారిన్
వినిరమ్మని చెలిపంపినఁ, బనివిని యదివచ్చి వినయపరవశయగుచున్. 168

చ. సముఖమువారిఁ ద్రోచి బురుసాపని చీరజరీచెరంగు వ
క్త్రమునకు మాటుసేయుచుఁ బరాకు లతాంగి సురేంద్రు కొల్వుబో
గముపఁట పేరుతార యనఁగా నులిఁగన్న మిటారి యెంత గ
ర్వమొ యిటుచొచ్చి రానచటి వాకిటి కావలి చెల్వ నిల్పినన్. 169

క. వారల జగడపుమాటల, తీఱిది వే యేమిలేదు దేవి యనఁ గఁగ
న్యారత్నంబును విస్మయ, మారంగను గొమ్మనిక్కమంతయు వినుచున్, 170

గీ. ఎదురుగా నేఁగి యానెకా యచట నిలిచి యెంతవింతనటించితి విందువదన
చాలురావక్క యనుచుఁ గెంగేలు పట్టి, తోడుగొని పోయిబంగారుమేడమీఁద.

చ. కలప మలందుచో నొలుకు కస్తురి చిందులచేత ఘుమ్మనన్.
వలపు నెఱుంగు బంగరు తివాసిపయిన్ దగునొక్క రంగుకే
ల్సులువు పరంగిలాగి జిగిచొక్కపుఁ గద్దిగ మీఁద నిద్దరుల్
దలగడఁ జేతులూఁది చిఱునవ్వులతో పసియించు యున్నెడన్. 172

గీ. రాజముఖి కొంతవడికి దారావధూటి, సొగసునెమ్మోముఁ దప్పక చూచి పేర్మి
నువిద నీవింత కొంచకత్తైవె జయంతు, గాపుఁ జేసిన గరితవు కావె నీవు. 173

క. అనిపల్కి నందులకుఁ బ, క్కనఁ దారయు నవ్వ నచట హరజూటవనీ
వనితామర లోకధునీ, వినుత ఘనీభూత రుచుల వెన్నెల గురిసెన్. 174

ఉ. ఆవనజాక్షి యంత దివిజాంగన కేలు దెమల్చి యో నెకా
యావిధమేమొ లెస్స వినవైతి పరాకున మున్ను నీకథల్
నీవె వచింపఁగా వినవలెన్ వివరింపుమటన్న నేమి లే
దే; వినవే యటంచు నది తెల్పఁదొడంగె నుదంతమంతయున్. 175

చ. కమలదళేక్షణా యమరకాంత్తు జయంతుఁడు నేను గూడియుం
టిమి కద నాఁడు వాని నెఱనీటుల వెక్కుడ వాని వింతయం
దములకు వాని యిచ్చకపుఁ దల్కులకున్ మఱి వాని మేనిడాల్
కొమరున కేను మేలుపడి గుత్తకు నిచ్చితి నేమి చెప్పుదున్. 176

సీ. ఇంద్రుకట్టెదుట నే నృత్య మాడెడు వేళ బుడుతలచే నాకు మడుపులంపు
అమ్మతో నొక కేని నలుక గడింపుచు నెటులనో నాయింట నేవసించు
తోఁడితిలోత్త మాదులు వచ్చిపాడఁగన్న నను జూచి కనుగీఁటి నవ్వఁజూడు
నెవ్వరు వినిపించి రేనియు వినఁట్టి మనవి నే తెల్పినంతనె ఘటించు
ప్రొద్దుపోఁకకుఁ గస్తూరి బొట్టుఁ బెట్టి, కీలుజడయల్లి సురతావిపూలు జుట్టి
సొగసుఁ జేసి యెగాదిగఁ జూచి సిగ్గు, మురిపెమును బొందు నన్నుఁ జేరి ముద్దు వెట్టి. 177

చ. సవసవఁ గా నెఱింగి తనుజాతుఁడు నేనును నుండఁ గొల్వులో
దివిజవిభుండు లెవగవుఁ దెచ్చికొనున్ శచియల్కఁ జూడఁ గై
తవమునఁ బిల్వనంపి నను దప్పకజూచుచు సొమ్ములెల్ల మ
క్కువనొసఁగుం చురుక్కురని కోడలిఁ జంకెనచే నదల్చుచున్. 178

క. ఈకరణి న్నాతోడిదె, లోకంబైయుండ నేను లోనగుచుఁ బురీ
రాకేందు వదనలాకడ, నీకడ ననుకొనఁగ నతఁడె నేనైయుంటిన్. 189

సీ. పనియుండి యెడఁబాసి చని రాకయున్న నే బిలువ నంపింతు నెచ్చెలులచేత
వనిత యెవ్వతె హత్తుకొనుమను వీని నటంచు వెంటనే బుడుతల వేగఁబనుతు
నతని నెవ్వరు దూరనాడిన వారితోఁ జలపట్టి వట్టివాదులకుఁ బోదు
రతిపారవశ్యత నతఁడొనర్చిన మోవిగంటి పిమ్మట నొవ్వఁగా నదల్తు
వాసు నవ్వుటు నింటికి వచ్చెనేని ప్రేమ రెట్టింప, నే చెలరేగి యుంచు

రిచ్చవడుమోముతోఁ జేర వచ్చెనేని, గుండెఝగ్గున నేమనుకొందు నబల. 180

చ. వలచుట జాతిలోనఁ దలవంపగు నే కద యింకఁ దాఁచఁగా
గలిగెడి దేమి నానుపుకాంక్షను దొల్లిటి వారి వీధిలోఁ
బలఁ గనినంత వెచ్చనగుబాటున కోరిచి యన్నదమ్ములన్
బిలిచివరీతిఁ బిల్వ వలపించెఁ జువీ యతఁడంబుజాననా. 181

గీ. అట్లు వలపించి లోనయ్యె నంచుఁ దేలక, తరుచు కావళ్లు పెట్టి మాయిరుగుపొరుగు
చెలులతోనైన ముచ్చటఁ బల్కనీక, త్రాడు గట్టిన వాని చందాన నేలె. 182

సీ. పలుక నియ్యడు కమ్మవలపు హెచ్చన నాసవములు దెచ్చిన యింద్రవనితతోడ
జూడ నీడొక వేళ జోగునకై వచ్చి మేలు దెల్పెడు జోగురాలి నైన
గూడఁగానీడు కొక్కొకంబు చదువుకోఁ జేరు వేలుపు రాచ చిన్నపడుచు
సరసమాడఁగనీడు వరుసఁదప్పక తెచ్చి విరులిచ్చు పుష్పలావికలతోడ
అకట యేమందు తల్లి యిల్లాలికైనఁ జెపగలదు గాని వానిలోనడచుదాని
కుబుసు పోకకు నేని వేఱొక్కదారి, మిసుక కూడదు మేరకు మేరగాక. 183

సీ. తారావధూటి బందాకోరుగాఁ జేసె మనజయంతుఁడె జాణయనెడు వారు
నదిగాక మోహింపఁ డతని బంటుగ నేలుకొనుటకై యట్లున్న దనెడువారు
దీనికేమాయెనే వానిఁగాక మఱెవ్వరిని బిల్వఁపట చూడు మనెడువారు
నది బుంతవాని మాయలకు లోఁగునె యెంపరిని జక్కఁ బెట్టునో యనెడువారు
ననుచు నచ్చర నెచ్చెలు లాడుకొంద్రు, నిగళముల తోడ మదహస్తి నిగుడు పగిది
వెంటఁ గావలి మాష్టీలు వేగిరింప, భూధరారాతి నగరికిఁ బోవువేళ. 184

కం. అతఁడెంత యెంచినను సం, మతమై మదిఁ దోచుఁగాని మతి యితరకటా
యతనానావిధలోక, స్థితి గొంపల మొంప వలపు చెడ్డది సుమ్మా. 185

చ. అడకువగాని పేరిమి జయంతుని పట్టున నొక్కతీరుగా
నడతునె కాని మున్ను నెర నమ్మిన నెచ్చెలి కాంద్రువచ్చినా
కడపయ మెట్టిరేనిఁ జతకావడ నిత్తు విరుల్ దుకూలముల్
విడెములు నాదిఁ గాగ నను వేఁడక మున్న ప్రియంబుఁ జెప్పచున్. 186

క. మిన్నకతదీయసఖు లే, కన్నియగావలెనటన్నఁ గానీదానిన్
చిన్నారి నగవు చూపుల, సన్నసె రప్పించి కూర్తు సమ్మదమొదవన్. 187

సీ. ఒరపుగా విరులతో నెరికొప్పు ఘటియింతు నదిమాఁగిజ్జెడయల్లి కొందు
గిఱచు గుమ్మడి గాజనానుము దిద్దు నదెమోని జిల్ల బొట్టునఘటింతు

నలిపన్నఁదోయి గొప్పులపండగీలింతు నదిమాని ముత్యాల హారమును
మినుకు సైకపు ప్రాతపని చీరఁ గటిఁదాల్తు నదిమాని తెలిచల్వ యలవరింతు
రవికె బిగియింతు నదియును నవలవైచి, కుంకుమపుఁబూత చిమ చిమఁగొనెడు దిన్ని
పచ్చికొనగోటితాఁకులు రచ్చసేయ, గుబ్బయరగానరాఁ బైటకొంగువైతు. 188

చ. వినుమిటులంతఁగాఁ దిమిరవేణి కుబేరుఁడు కమ్మపంపఁగా
దిన చిరి చీటులందు గడిదేరు జయంతుని వర్తమానముల్
వినినలకూబరుం డదిర వేలుపు జేని కుమారునిన్ మువం
బెనయఁ గనింత పేసెనిది యెంతటిదో యని విస్మయంబునన్. 189

సీ. తిరుగఁడే కొన్నాళ్లు సరసీతిలోత్తమా పుంభావ సంభోగములకుఁజొచ్చి
చెలఁగఁడే కొన్నాళ్లు చిత్రసేనాకంతు పారావతారావ పటిమఁ దగిలి
నవఁడే కొన్నాళ్లు నవ మేనకాధరాధర సుధాపాన విస్ఫురణకలరి
మెలఁగడే కొన్నాళ్లు కలితోర్వశీవశీ కరుణాకరోక్తి వైఖరికిమెచ్చి
కరలి దెరగంటి దొరసూతి కేళులందుఁ, జొచ్చిచూడక మానినచోటుగలద
నన్నుఁబలె యొర్తుపైఁబడియున్నవాఁడె, సుకరముగ మేలువడెనె వాఁడొకతెకేని.

గీ. చదివికొన్నాడు మదనశాస్త్రిబులెల్లఁ, తెలిసికొన్నాడు వెలమిటారుల బెడంగు
కొసరు వగలెల్ల నటువంటి కోడెకాని, వలచి వలపించు కొనియె నే వనరుహాక్షి.

సీ. అతఁడింటి కల్లంత నరుదేరఁ దావచ్చి మించుచూపులనె తేలించునేమొ
యతఁడు కీల్జడకేల నదిమిన మే నొసరించి కోపమున గద్దించునేమొ
యతఁడించుక పెనంగి యలయఁ దానదలించి మించి పైకొని పేచారించునేమొ
యతఁడు చక్కెర మోవి యానఁ దా గుల్కుటెల్గించి బిగ్గిలఁ గౌగలించునేమొ
బెడఁగు మొనపంట నగమాకు మదుపులిచ్చి, కొసరుమాటల మఱియును గూడ నెచ్చ
రించి యాతని కాసపుట్టించునేమొ, బాల సురతాంతమందు బాగాలొసంగి 192

క. ఇదిగంటివి యీనరకున్, మదనక్రీడారహస్య మతకోవిదయై
ముదమునఁ దేలింపుచునను, చదురాలై యిపుడుచాల జొక యొనర్చెన్. 193

సీ. నేవచ్చువేళఁ దానింట నుండకపోయి పొరుగింట నిరుగింటఁ బ్రొద్దు గడపు
నలవాడు నీచుట్ట మరుదెంచె ననిన నేమాయెలే వచ్చుఁ గాకంచు బిగియు
నిలలేక స్వయముగాఁ బిలువఁబోయినఁగాని బెదరించు నిదిగొ వచ్చెదనటంచు
వలసినప్పుడువచ్చి యలిగియున్నట్టినే పలికించుదాక దవ్వులనెనిల్చు
నంతటను నేనె పైటకొంగలమి బలిమి, సెజ్జపైఁజేర్చి యలకలచిక్కుఁదీర్చి

మ్రొక్కుచు నవల్చి నునుపోకముడివవల్చి, కరఁగఁ జేసిన యటు మీఁదఁ గౌఁగలించు.

చ. పరిపరిరీతులం బ్రసవ బాణుని కేళి యొనర్చు తొంటివై
ఖరిఁ నెర పారుతంపురొద గానఁబడం దలయెత్తి నామనో
హర డవునీవ యంటి నవురాయను నంతటి పారవశ్యముం
బొరయుదు నున్సరించుఁ గను మోద్చుట లేదిపు డించుకేనియున్. 195

క. నెనరైన దాఁకిటువలె, గనరైనను వీడ చూచెఁ గడుమాలిమిచే
దనరంగ స్మృతులు నెయ్యేడ, పనవవేయతి పరిచయాదవజ్ఞాయనఁగన్ 196

గీ. దీనిపొగరార్ప నెరసేర్చు దిట్టతనము, మురువు హరువును గల జగన్మోహనాంగి
శ్లేషుగా యంచు దివిని గాలింతు నేఁడు, కలిగెఁ గాతార నవకాంతి దలితతార. 197

చ. అని చెలికాండ్రతోడ నతఁడాడిన ముచ్చటలెల్ల వారునన్
గనుఁగొనివచ్చి యుచ్చకముగా వినిపించిన నెంత మాట చ
క్కని జవరాలు రంభ యదిగాక జయంతుఁడు తాము నుండు వ
త్తన కిదిమెర తామెరుగరాయని చీటిని బుచ్చిపంపుదున్. 198

ఉ. అంతట నెక్కునాఁడల ధనాధిపుఁ డశ్వము వాగె వెక్కసిన్
రంతులు మీఱ నెక్కి పెనురౌతన జోడన చెల్వఁ జూపుచుం
బంతము మీఱ నీథుల దుమారము రేఁగ సవారిఁ జేసి ప్రా
ద్దంతయు నెక్కుఁగా నడుమ యించుక మేఁశ్రమంబు పూనఁగన్. 199

చ. హరిగెలనీడ వేత్రధరు లయ్యెడ నామములుగ్గడించి హె
చ్చరికె యొనర్ప మ్రొక్కు భటజాలము వీడ్కొని యాస్యపద్మముం
బరిజనులంప పుంజలువ బావడలందుడునంగ నాత్మమం
దిరమున కేగి యందు నొక తిన్నని కెంపుల తిన్నెనిల్చుచున్. 200

ఉ. జెట్టులు చేరిలేత విడి చెందొవ వ్రాతరుమాలువున్ సిగం
జుట్టి యలందుకుంకుమపుసోకుల బంగరుతీగెరంగుని
ట్టట్టన నీని జందెము భుజాగ్రమునం బడవైచి సీత్కృతుల్
దట్టముగాఁగ వింతవగలన్ మెయిమర్దన సేయునత్తరిన్. 201

చ. చెలువపు వెన్నతోఁ జలిదిదిక్కములున్ మెదత్రాఁడు చీఁకటుల్
గులికెడు నీలిదట్టిపొరలోపల కమ్మ చెరంగు వెన్నునం
దొలకెడు నెత్తిజుట్టు తెలిదుప్పటి వీనుల మానికంపు నా
గుల పడగల్ రహిఁ దగనొకొండగు యొంటరి బోయఁడు స్థలిన్. 202

గీ. వచ్చి యనఘాయ కువలయాశ్వక్షితీంద్రుఁ, డల్లపాతాళకేతుఁ గీటడఁచె ననుచు
నచటికరుగుమనుండి సురాధినేత, మిమ్ముఁరమ్మనియిదె యుత్తరమ్ముపనిచె. 203

క. అని వినిపించు కుబేరుని, కని చెంద్రిక మీఁదవ్రాసి యందు శిఖావే
సిన కమ్మగద్దె చేరున, ననిచిరఁ జూచుకొని చుట్టి యున్ముఖుఁడగుచున్. 204

సీ. హరినీలములమేడ యవలకెంపుల సజ్జ కడమకట్టఁగ నుడుగర యొసంగి
పెరచోట పడిదాచిపెట్టిన నవనిధానములుదేనాప్తసంఘములఁ బనిచి
కారుకులెత్తి చక్కఁగఁ జేయుఁడలచైత్ర రథమని తగు భటప్రతతిఁబనిచి
యరయమిచే డొక్కలంటి పెట్టుకయున్న యిభకోటులకు మేపులిడ ఘటించి
పుడమిఁ బాతాళకేతుండు గెడసినపుడె, నిత్యముగ నిల్చె నలకాధిపత్యమనుచు
ననిమిషాధీశ్వరుని చెంతకనుపఁదలఁచి1 పుత్రుఁ బిలుమన్న నూడిగరపుభటులపుడు.

గీ. తోడి యక్షకుమారుల తోడఁ గోడి, పడవగొడవలఁ బడి యక్షపతిసుతుండు
గొడమైల శలాయష్టు కాకివన్నె, మొదలుగాఁగల కుక్కుటంబులను దెచ్చి 206

ఉ. పట్టెపు జుట్టునిక్కు మెడ బాగునఁ జివ్వినయార పొంకమున్
రెట్టల బల్మి నెమ్మిఁ బురణించిన యీకల జోకులున్ దగల్
గొట్టిక యుండ మేపు పలు కోయపుమందులు గల్గు పుంజుఁ జే
పట్టి గ్రహంబు వెన్కఁగనుపట్టఁగ నల్లలు దీసి యంతటన్. 207

గీ. ఎదుటిదానిని విడుమంచు హెచ్చరించి. యతఁడు తను వేగిరింప మల్లాడికొనుచుఁ
గినిసి యొండొంటిఁబిట్టుదాకించియీసు, బోడమరెంటెనిగదియించివిడుచుటయును.

వ. అప్పుడనిర్వార గర్వథామంబులగు నత్తామ్రచూడ సార్వభౌమంబు లతి రూక్ష వీ
క్షా పరంపరలఁ జురం జురంజూచి పవరంజుకొని జుంజురించిన మెడలు నిగుడించు
కొని సాటిలేని యీనునం గాటియ్యక తిరుపులుగట్టిన యొరపునందిగుచు నింపు
సొంపుల గుంపులు గొని నిజవిజయపరాజయంబులు గోరుచు నొకళ్లొకళ్ళ త్రొక్కు
ళ్ళఁ బోడము జగడంబుల జరాలుమనంగటాములు డుస్సుకొని పెద్దలు వారింపం దే
రి యచ్చటికింజేరి మూంచుకొను కొంచెపుగాండ్రు పెడమోము వెట్టినటెంక వెంటను
ట్టినడువ గోడి నెత్తికొను పోవుచు నెట్టికొనిదగలు తొట్టినం బట్టి యీకలందె
మడ వెడలించి పన్నిటితేటల రెట్టలకుం జలువ పుట్టించిన కట్టలుకంబట్టి తప్పించు
కొని యొండొంటి నంటి నొప్పించుచు నేవమీరి గౌతమమునిపుంగవాంగనా మా
న భంగకరణాది కారణారవ నిర్నిద్ర చరణాయుధలోక పట్టభద్ర గెలిచితివనుచు
నుతించుచుఁ బంచె వన్నెపావడలువైచుచు మచ్చరంబున నిరువాగును నెచ్చరించి

న నిలిచి తన్నుఁ బోరు నెడఁగు జేరకుమారుని కుక్కుట కంఠీరవంబు వెనుక నడని కేడించి చుట్టుకొని చురుక్కునం జుట్టు నొక్కినఁ గ్రక్కున నది లేవనిపించి యెదిరిఁ జరణాయుధంబునకు నడ్డంబుగా నడచి యారె విరుగంచున్నన నంజక యక్షకుంజరుని పుంజు బిరబిరం జుట్టి రెట్టలోపలం జలసొనిపి గిలిగింతలు గొనినం బ్రతిపక్షియు నెగిరి తప్పించుకొని గుప్పున నవ్వాలం గుప్పించి యెదురై యులికి కరము వంగురిన నలకూబరుని కోడియు సమంపరయంబునం గ్రిందికిఁ దగ్గి నెత్తురు జొత్తిల్లఁ గుత్తుక కఱచి వెనుకకు మ్రొగ్గి యీడిగిలంబడిన నవరాతియు మెడ ముడివిడిపించుకొని తరిమిన గ్రమ్మకొను చెమ్మటనపయ మున్నెయోడెననుచు నెల్లవారలు గొల్లుగొల్లున నవ్వుచు నెన్నుకొనం గిన్నరరాజకుమారుని చరణాయుధంబు సేవదేరి యడియాసలుందన్నుకొని వచ్చు నభియాతినలయించి సిలువంబడు నెడం జేరి పొరిపోవంచున్నన. 209

గీ. కేరితోడఁ దట్టికొని బిట్టుకేక వైచి, మీసములు దీటి యెదిర్లకిరోస మొదవ
డవిణ వాయింపఁ జేయుచు డాసి పుంజు, నట్టె దూచుచు నున్నట్టి యతనిఁ గాంచి.

చ. ఉడిగపువారు చేరి సమయోచిత మేతగఁ దెల్పుసుద్దులే
నుడువుచు నోగదా యని కనుంగొన జేవర సంతరించు నె
క్కుడువగపుం జుతోడ నొకకోఁడి యెదుర్చునె యాంచుఁ జెంతకుం
వడిఁ జని యయ్యగారుపిలువంబనుపం బని వింటి మంచనన్. 211

సీ. ఒక్కఁడు చెంపకై యొరఁగుపువ్వులతోడి దసిలీరుమాలు వందముగఁ జుట్ట
జేరి యొక్కండయ్యగారిచ్చుకట్టు పర్గములకు ముల్లెలు గైకొనంగ
నొక్కండు దరహాస మొదవంగ నేటికుక్కుటము కేడించిన గొడవఁ దెల్ప
నొక్కండు రంభాపయోజాక్షి పడవ గెల్చినమాట వినిసంతసించుననఁగ
నతిగి తండ్రికిఁ బ్రణమిల్లి యతఁడు కమ్మ,నచ్చుటలు దెల్పి తేజీదు వాలి నోలి
నలసియున్నాడ నీవేగు మనుచు ననుప, నగుమొగంబున వీయని నగరు వెడలి. 212

సీ. సానిపటాణి తేజిని ముందర నిల్పి సామి యటంచు సలాము సేయ
మావటీఁడు గజోత్తముముఁ దెచ్చి యంకుశంబు దనర్చు కేళితో మ్రొక్కవేయ
సారథి రథముకన్ చాయనుఁ బోనిచ్చి యటు నిల్పి వచ్చి జోహారు సేయ
దాకాధినాదు డంచళము ముందర నిల్పి తమిసపాత్తులతోడ దండ మొసఁగ
పావలటు మీటి కొల్లారు బండియెక్కి, దురదురన రంభ యింటికి నరిగి తనదు
పయన మెఱింగి సమ్మదపడనిదాని, గస్తురించుచు ననిపించుకొని యాతండు. 213

చ. స్ఫురితవిభాసమానమగు పుష్పకనామ విమానమెక్కి ని
ర్జర తతి తోడ నేఁగి దితిజక్షణ శిక్షణ దక్షరూక్షభా
స్వరశర సాంద్రుఁ డా నృపతి చంద్రుని నుతించు సురేంద్రుఁడు వెంబడిం
జరిగి శుభాకరంబగు తదీయపురంబును జేరి యందులన్. 214

క. అల యదితి విప్రపూజలు, సలుపంగనుఁ గొనఁగఁ బాకశాసనుఁ డుతనున్
నిలుపఁగ నలుపానించిన, చెలువొందెడు విడిదెలో వసించె నతండున్. 215

గీ. అనమదాలస తారామృగాంకవదన, తెల్లముగ మీఁది కత లెల్లఁ దెలుపు మనియె
ననిన జైమిని ముని యా విహంగములన, నంతరకథావిధం బెట్టిదని యడిగిన. 216

అశ్వాశాంతపద్యములు

శా. సంధ్యాతాండవ చండ ఖండపరశుస్ఫాయజ్జటా మండలీ
సంధ్యాహిండితగాంగ భంగజ మిథస్స్వాఘూర్ణి పుంజీకృతా
వంధ్యారావ ఘుమంఘుమోన్నతి సపత్నాబ్జాల పుణ్యాకృతీ
వింధ్యక్ష్మాధర కూట కోటి విచరద్విద్వేషి యోషిత్తతీ. 217

క. అమిత ప్రతాప తాపని, సమదాన విభావభావ జన్మాకారా
నుతగోత్ర గోత్రభిన్నుత, హిమకరనిభకీర్తికాండ హిమకరగండా. 218

మాలిని. ధరణిపకులసోమా, దర్పితారాతిభీమా పరిహృతకవిభూమా భానుసంకాశధామా
సరసకవనభోజా సాధుసంతానభూజా, మురరిపునుతతేజా మూర్తినుంబాతనూజా.




ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితాప్రాభవ సవరమన్వయాభరణ నారాయణభూపాలతనూభవ శఠగోపతాపసేంద్రచరణారవింద సంచలన్మానసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణావంధ్య కామినీమనోహర రూపరేఖావిజితచైత్రకాశ్యపగోత్రపవిత్ర జాతివార్తాకవిజనామోదసంధాయక చిననారాయణనాయకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రంబను మహాప్రబంధంబునందు చతుర్థాశ్వాసము.

సమాప్తము.



శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## పంచమాశ్వాసము.

---

క. శ్రీకర సమరము తిమ్మధ, రాకాముకగర్భజలధిరాకాచంద్రా
లోకనుత దానగుణ సం, ధాకర్ణసమాన నారణ నరేంద్రమణీ. 1

గీ. అవధరింపుము జైమిని కలపతంగ, కులపతంగంబు లిట్లని తెలుపఁ దొడఁగె
నమ్మదాలసతో మనోహర సుధా, విధానధాన వచోరీతిఁ దారపలికె. 2

వ. అవ్విధంబున నమరావతీపురంబుఁ జేరి నలకూబరుండు. 3

మ. తననీటుల్ మెఱయించు జేన పొడవుగా దాల్మింటి యందంపుఁ గుం
దనపుందల్కులు గ్రుమ్మరించు చిరుసానాకత్తి చిమ్ముం గళం
బున గోరొత్తుల పేరి యారజపు సొమ్ముల్ మోవిపైఁ గెంపు ని
గ్గను మీసంబులు దిద్దినాడికొను జగ్గుల్ మీర నావీథులన్. 4

సీ, చూచి దిగ్గన లేచు సుదతిఁ గూర్చుండవే యనుచోట మొగమున నలరుకులుకు
రంభ సేమము వేఁడు రమణీమణి మొగంబుఁ జూచుచో నవ్వులో సోలయు హొయలు
నెదురుగాఁ జనుదెంచు నింతి మ్రొక్కులనందికొనుచోటఁ జూపులఁ గులుకుసొగసు
కసయందలము డిగ్గు వనితతోఁ బరిహాస మాడుచో మాటలో నందగింపు
బుజత లందిచ్చు తెలనాకు మడుపుపంట, నందికొనుసీటు నుడువులో నారజంపు
బిత్తరపుపాట రొమ్ములో బిగువు నెగడ, నేఁగునాకారి వెంటనయ్యెమ్మెకాడు. 5

ఉ. చక్కదనాలకేమి నెఱజాణవు నే కట తప్పగాదు లే
మెక్కుల రంభభాగ్యము కడింది సుమీ యిటువంటినాయకున్
దక్కఁ బెనంగెఁ జూడు మనినం బిగువెత్తుదు నీకురోసమా
యెక్కడిదో యటంచుఁ గలహింతురు నాథులతోడ నచ్చరల్. 6

చ. అలిగెడుతీరు వేడికొను నందముఁ బొందికలోని పొరువా
పలుకుల భేదముల్ సురతబంధములుం గళలంటు వైఖరుల్
వలపులు రేఁచు నేర్పు నెరవాదులతో వివదించు కట్టుఁగొంగు
లముడివీఁడ నచ్చరలు గుంపయి పొంచు వినన్ ముదంబునన్. 7

చ. వెలుపలిరచ్చ నొక్కయెడ వేలుపుసానికి పన్నెకానికిం

గలహాము కర్గైనేని జతనంబునఁ జేరఁగవచ్చి రోసపుం
బలుకుల వాడు రేపి శిగపట్లకు డగ్గరఁ జేసి క్రొవ్వునం
గలకల నవ్వువాఁడు చవుకట్లసియాడ రుమాలు వీడఁగన్. 8

సీ. సంగీత మేళముప్పాంగఁ దేజీనెక్కి కంప మంటుచు రవగాలు చూపు
పగటుపానలు మెట్టి బల్లు కైవారముల్ జోడింప హారిగెల నీడకేగు
విచ్చుకత్తులవారు వెంటరా నంపలంబును నిబ్బరంబుగాఁ బోవనిచ్చు
జగను బూని మాష్టీని సుద్దులుచెప్పి కొనుచు నెచ్చెలికాండ్రఁ గూడి యరుగు
పికిలిపిట్టల కోట్లాటఁ బెట్టి చూచు, దిట్టతనమునఁ జెఱకు పందెంబు లాడు
డీకొనఁగఁజేసి యనికిఁ బొట్టేళ్ళవిడుచు, రంభ చుట్టంబు వైభవపాభిభవమున. 9

సీ. అమ్మక చెల్ల చోద్యముగాక నామీఁద మనసు పుట్టునె వానికను మృగాక్షి
యెన్ని మాయలు గుత్తకున్న దానిదొరంగి యసల మాటాడునే యనులతాంగి
కాక మరేమి రంభాకాంతతోడి కయ్యాన కెవ్వతె యోర్చు ననువధూటి
అనువుకాడయి తన యక్కఱదీరిన నచటికే చనుగదా యను మిటారి
గ్గురి గుజగుజలాడుచు నాత్మవిటులు, కొసరుఁబల్కులతోఁ గ్రుచ్చిగ్రుచ్చియడుగ
నేమిలేదని మాటి పాఁగెంగువదన, లాతఁజడిగింప నిజగృహాభ్యంతరముల. 10

ఉ. నంటున సొక్కి నేను కూనా ఘనమాగునిఁ దోడికొంచు మా
యింటికి వచ్చి సిగ్గునడి యేఁ జన నానలు వెట్టి పిల్చి క్రేఁ
గంటనె నన్నుఁజూచి యరుగుంగవ యేమిటికో యతండు చో
క్కుంటఁగ మోవి నొక్కికొని యావల యూచు నోయార్ధ మేర్పడన్. 11

ఉ. అంతట మేళవించిన యొయారపుతంబుర చేతికిచ్చి యే
వింత పదంబుఁ బాడఁ బదివేల విధంబుల మెచ్చికొంచు మే
మింతటఁ బోయి రా వలవదే యని దుప్పటిఁ దెచ్చి కప్పుచోఁ
గొంత కరంబుగీరుఁ గొనగోర ననున్ నను మేను జుమ్మనన్. 12

క. అది మొదలుగ నితరవధూ, హృదయంబులఁ దన్నునిలువ నీయనికతనన్
మదనుఁడు నామదిలోపల, సుదతీమణి తనబలంబుఁ జూపందొడఁగెన్. 13

క. నానాటఁ బాటలాధర, యేనాటలు పాట లుడిగి యినుమడికోర్కుల్
లోనాటఁగఁ దద్రూప, ధ్యానాట మనోంబు జాత్నై వర్తిలుచుణ్. 14

ఉ. కలికితనంబుఁ జేర నయగారము మీర జయంత యేమిరా
పలుకవు వింతచో మనసు బారెనో యేమిటఁ బ్రొద్దుపోదురా

చ. విడువని కౌఁగిలింత పురివిచ్చని మచ్చిక తన్వు లేని సం
దడి కొసరింత చూపు మరునాటికి రమ్మని మ్రొక్కు తోడి త్రో
క్కుడు వగ మాట నీటొలయు గూడని నెమ్మది గల్గి యొక్క కై
వడిఁ నెడఁ బాసి యింటికిని వచ్చితి నాతఁడు నేఁగునంతటన్. 31

క. దినదినమున్ వనమున ముం, దనజనముం గనుమొరంగి ధనరాట్సుతుతో
ఘనరాగము దనరారఁగ, ననరాశిక్రీడ నోల లాడుచునుండున్. 32

ఉ. అక్క యిదేమొ కాని తెలియం బడదాతఁడు వీధివెంట బల్
టక్కులతోడ రాఁ బొదిగిటన్ నిలువంబడి తొంగి చూచుచో
దక్కిన చేష్టలున్న వెకదా మఱి యెక్కడనుండి వచ్చునో
పక్కన వచ్చునమ్మ చలపాది మిటారపు నవ్వుతొక్కటన్. 33

క. తనువు జయంతుని పక్కన్, మనసా ధనరాజవరకుమారుని చెంతన్.
జొనుపుదుఁ గోరకదశనా, ననదసెనాజోదు దురమునం బెనఁగు నెడన్. 34

సీ. చెలరేఁగి వలరాచ వెలుపుల పెనుకతల్ వినిపించునప్పు డూకొనెడు దారి
ఎటుఁ బోయి తన నిట్టి యెడకంచుఁ బొసగింపఁ బోవుచోఁ దడఁబడుబొంకుమాట
వ్రేకఁటి యలుక కల్పించి మంచముకోఁడు గౌఁగలించుచో కమ్మగాని వింత
యల్లయా చెలిమంచిదని మెచ్చుచోఁ గోపగించక మైకొలుగాంచు నేర్పు
నించువిలుకాని జగడాన నెంతతడవు, చాలునను పల్కు నిన్నాళ్ళసరణి రాజ
రాజతనుజాతుఁదలపకూరకయ యుంటఁ, దెలిసి దేవేంద్రసుతుడు సందియముఁ జెందె.

గీ. అంత నచ్చట రంభామృగాయతాక్షి, యేమొ నలకూబరుం డంటి యిఁక వుకొనియె
నౌర యంటినఁ గమ్మకు మారుకిమ్మ, యంపఁ డెంతటి దొరతనంబనుచుఁ బలికి. 36

సీ. వినవింపుగా మేళవించి యుంచినయట్టి యల్లవీణియ యుంచి నట్లెయుండ
వెరబొంత గొసెనవేసి మూసినయట్టి యరలపెట్టియ మూసినట్లెయుండ
నెఱికగాఁ బెట్టి దండెము మీఁదవైచిన యంగదట్టము వైచినట్లెయుండ
నెరపుగా నూరి గిన్నియల నించినయట్టి యరిదికుంకుమ నించినట్లెయుండ
నెందుపై నిచ్చలేక యేమేమొ తలఁచు, కొనుచుఁ జెలులను జంకించుకొనుచు జిలుక
కొసరుమాటకుఁ గట్టిగాఁ గసరుకొనుచుఁ, దాళగూడనివింత విరాళియెత్తి. 37

గీ. చికిలిలోపల నే చీమచిటుకుమన్నఁ గనకననమాయు బకదారి కవలకడన
మరుని వెరళించు మల్లంటు విరులకడనఁ, బడుకయిలుమాని విరహతాపంబుబూని. 38

సీ. నీనాయకుఁడు వచ్చె నేయన్న విసువుగా నతఁడేమిటికి వచ్చునమ్మ యనుచు

సోలవకుమదిగో వచ్చునటన్నఁ బోలి వాఁడిటువచ్చి యెంత రాకెంతయనుచు
రాకున్నవాని గోరకుమన్న నయ్యెఁబో నవ్వానిఁ గోరనాకేల యనుచు
యదెవచ్చెనన లేచి యందఱానాననఁ జిల్కను బిల్వవచ్చితినటంచు
చెలుల కాత్మీయవిరహంబు తెలియనీక, మాటిమాటికి నిలిచిన చోట నిలువ
కాలుతా తన్వి మది జాలిమాలికొనుచు, నతనికడకేగు తమి నున్నయవసరమున. 39

సీ. కైటభాదినిశాట ఝాట ఖండనపాట వాటోప కరు మీఁది పాటలమర
రాజతాచల రాజ రాజహంస విరాజి, తంబగు తనుకాంతి యోజమెరయ
తోయజినీ ప్రాణనాయకరుచి ఛాయ కాయతంబగు జటా చ్ఛాయవెలయ
సామజ ఘనసారసోమ కల్పకభూమ ధామకంబగు నక్షదామ మొలయ
ఆలములు లేని డొక్క వెన్నంటికొనఁగ, దెలివిగలకన్నుఁదోయి గుంటలుపడంగ
బొంచికొని జెట్టిమాట లాలించుకొనుచు, నచ్చటికి వచ్చె వేలుపు గచ్చకాఁడు. 40

గీ. వచ్చి యచ్చరప్రోయాల వచ్చి వెనుక, మ్రొక్కుదువుగాని కొమ్మనీముద్దుచుగని
యొద్దనుండినదని వీణె యొరగులోని, చీటివడి నిచ్చి చనిన నచ్చెరువుదోఁప. 41

క. అది చదివి కొంతసేపా, మదవతి నివ్వెరఁగుకతన మ్రాన్పడి మఱియుం
జదివికొని యదిగ తారా, మదిరేక్షణ కింతభోగమా కావలెనే. 42

సీ. మఱచెనో సంగీత మర్మకర్మములు నావలన నొక్కొకవేళఁ దెలిసికొనుట
యెఱుఁగదో తాను నాయింటికి వచ్చి నే నీదాన జుమ్మీ మన్నించు మనుట
కానదో యూర్వసీ కాంతకుఁ దనకు వాఁడెచ్చిన నేను వహించుకొనుట
తలఁపదో సురరాజు కొలువులోఁదన పాటవినిపించుమని నన్ను వేఁడికొనుట
యేటికిక్షపని తన చెల్మి వీటివోవ, నిన్నఁగదవమ్మ వింతవన్నియలవంచు
సురటు లంతలఁ బల్లటీ జోడులనిపె, నింతలోనన యీగర్వమేల వచ్చె. 43

సీ. దేవేంద్రుఁ గనఁ బోవుచో వాని చెంగటఁ జెలుల నమ్మక దాని నిలిపిపోవు
వాఁడు నేనును వింతవగలఁ గూడిన పొందికల దారి దానితోఁ బలికికొందు
దీని నేటికి నిందుఁ దెచ్చితి వన వానిదిక్కు వీక్షించి గద్దించి వైతు
వాఁడు నామది మెచ్చవలసి తెచ్చినమంచికానుకల్ వెసదాఁచి దానికిత్తుఁ
గపట మింతేనిఁ దెలియదుకనుక మేక, వన్నెపులియయి యిందుఱ్ఱమ్మనఁగ నిల్లు
సైగొనుట గానలేక యాకాపురాలఁ, గారవింతునె నమ్మినే వీరిడైతి. 44

గీ. అప్పుడేవాని బావ బావనుచు మేర, మీరినదువంగఁ గని మందె మేలమనుచు
నోర్చుకొని యుంటిఁగాక యీయుత్పలాక్షి, గురువులకు బొమ్మవెట్టుటయరయనైతి.

యల నలకూబరుం బిలువ సంపర యంచును బిల్వఁ బంచి సొం
పులఁ గడకంటిచూపులనె ముచ్చట తీరఁగఁ జూతు నాతనిన్. 15

ఉ. జవ్వని యించుకే మొగము చాటున నుండఁగ బేర సూతి యా
దవ్వులనుండి నాపెదవి తప్పక కన్గొన నే నెఱింగి లో
నువ్విలుబూర ముద్దుమొగి యూరక తాబయలానినందుకే
నవ్వఁగఁ దానునవ్వి సురనాథకుమారునిఁ బిల్తునాయనున్. 16

సీ. వానిఁ దొయ్యారంపుఁ బావలు తెప్పించి సిబ్బెంపుఁ జనుఁదోయిఁ జేర్చుకొందు
క్రేవఁ దప్పక చూచి తీవిగా వాడరెనుఁ జూపఁ జూపు గ్రక్కున మరల్తు
వానిపైఁ బద్యమెవ్వరు లేనివేళఁ బాంచాల శయ్య పొసంగఁ జదివికొందుఁ
బరులతో నర్మోక్తి పలుక నే నెఱుఁగి లేనగవుతో వాని నెమ్మొగముఁ జూతు
మఱియు నొక్కొక వేళ సుమాళి మొదవఁ, బరిమళంబుల బాగాలు పలకనుంచి
నే నొసంగఁగఁ గొంకిన దాని కరణిఁ, బ్రియునిచేతనె వాని కిప్పింతునమ్మ. 17

చ. అలికచ జోలి తప్పనటు లయ్యెడు నాటువికార మంతయున్
దెలుపఁగ వచ్చినన్ వినఁగదే మఱియంతట నొక్క నాడు నె
చ్చెలులమొరంగి కేళిగృహసీమ జయంతుఁడు లేనివేళ గు
బ్బలపయిఁ బైటజారఁ బువుపాన్పు పయింబడి నెమ్మనంబునన్. 18

సీ. ఇది యేమిచోద్యము మదిలో వితావితా నలకూబరుని మీఁద నాకుఁ బ్రేమ
దొర కుమారుండును దురుసు కటారిగాఁడీ జయంతుఁడు బాయనీఁడు నన్ను
వాఁడైన మఱిఁ గొంచెకాఁడు మాష్టిని జోకలు జూపఁదగు సగకాఁడు కాని
యందఱిలో మున్నె యగడౌట చాలదే యింక గోహోరు వాదేల తనకు
నేటికి గోష్ఠోరు తనకు నాకేల వెఱవ, నౌర యిల్లాలనా వారివారి కరణి
కంటికింపైన వానితోఁ గలసి మెలఁగ, నన్నుఁ గన్నాఁడు మావారి నాయకుండు. 19

ఉ. ఒక్కటి రంభ యేమను నొక్కొయని లంగుట యంతె కాక నా
కెక్కడి యాజ్ఞ యాసరసిజేక్షణకైనఁ బనేమి యెమ్మొకా
డొక్కటె సొమ్ముగా నిలుచునే యది యేలిక సానియే యిదే
మక్కట యైన దాని నిలయంబున నుండఁగ హత్తుకొంటినో. 20

ఉ. అందులకేమి యప్పటికి నైనటు లయ్యెడుగాని నేను వా
రందరు గానకుండఁగ ధనాధిపపుత్రునిఁ దెచ్చి కూర్చు వా
రిందు మఱెవ్వరట్టి పని యెవ్వరితో నెఱిగింతుఁ గూడ దీ

యంపము లెస్స యంచొక యుపాయముఁ గాంచి సునిశ్చయంబుగన్. 21

ఉ. అంగజసన్నిభుండగు ధనాధిప సూతికిఁ దార ప్రొక్కి చే
యాఁగల విన్నపంబు మపనాతురనైతి మదీయమందిర
ప్రాంగణ వృక్షవాటికె రయంబున రావలె రాకయున్న నీ
యంగన రైన రంభ పదమాన యటంచొకచీటి వ్రాయుచున్. 22

గీ. ఒక్కసంపంగి బంతిలోఁ జెక్కివింత, యంపమిదిలెస్సచూచి కొమ్మని కుబేర
పుత్రునకు నిచ్చిరమ్మన్న బోఁటిపైఁట, బొదివికొని ముద్దునడలతో బోవునపుడు. 23

ఉ. చెక్కిటఁ జేయిఁ జేర్చి ననుఁజెందెడు కోర్కుల నూడిగంపు వా
డొక్కఁడుఁ దాను నుండి యతఁడో చెలి రమ్మనరేంద్రనందనుం
డెక్కడనున్నాడెఁ దార యిపుడేమి యొనర్చుచు నున్నదంభు పె
న్మక్కువ నాదరించి బహుమానము సేయఁగ డాయ నేఁగుచున్. 24

గీ. అయ్యొ మాబావ తపయజ్ఞ్వయాచరించు, విష్ణుపూజలకటిగె నెవ్వేళ రాడు.
వనితయీబంతి మీచెంత కనిచె వింత, చెలువు గూర్పంగ గలదని చేతికొసఁగ. 25

చ. కనుఁగొని మోవిఁగ్రొవ్విగతి మొగంబునఁ జేర్చుచుఁ బల్చుకం బలెం
గనుఁగవఁ దార్చుచుం జెలికిఁ గప్రపు వీడె మొసంగి పంచి యి
చ్చిన తమిచెండు విచ్చి యటఁ జెక్కిన చీటిపఠించి చూచి యే
మని కొనియాడెనో తెలియ దంతట నిచ్చల నేను గ్రక్కునన్. 26

ఉ. ఇంతకు వచ్చునో యతని కీపనికిన్ మనసొగ్గదో శచీ
కాంతుని యొద్దకీ యళుకుగాంచునొ చూతమటంచు వెంటనే
కాంతయురాక యుండఁ దిరుగందిరుగం గనుఁగొంచు మద్వన
ప్రాంతముఁ జేరి యందొక లతాంత నికుంజముఁ జేరబోయినన్. 27

క. మొలపంక పెద్దకత్తియు, చెలువగు చేలమ్ము ధట్టి చెరగులు బురుసా
తళుకు రుమాలువు మించఁగ, నలకూబరుఁ దద్గృహంబునం గనుఁగొంటిన్. 28

గీ అప్పుడేమందు నాదు సిగ్గమ్మలార, వెనుకడుగుగాగఁ దలవంచికొనఁగఁ జేసె
కాంచి వాఁడును నిలువుచఁ గౌగలింపఁ, బొంగి పైఁబడితిని బైడిబొమ్మవోలె. 29

మ. అకృతానందవనివాస దీనవచనం బప్రాప్తచేష్టావిధా
నకమజ్ఞాత నఖక్షతాంకుర మసందష్టాధరోష్ఠంబ పే
తకపోతారవ మప్రయుక్తగురు బంధప్రౌఢిమంబైన ద
ర్పక జన్యంబున నేస్తురాల నయితిం బ్రావీణ్య హైన్యంబునన్. 30

గీ. ఇపుడు సైతము దానిపై నీసులేదు, నమ్మికయె గాని యాతంప నాల తపసి
కడుపు సాకంగవలసి యాకరణిఁ జీటి, నేనుగిరియంగ గల్పించె నేమొకాని. 46

మ. అకటా కాదిది తారప్రాలవును జుమ్మా కన్నె యావన్నె కా
నికిఁ దానంపిన దేమొ చీటి మతివానిం జూడఁగాఁ బోయి మా
సికులాగ్రేసరుఁ డేమరించి వడిదీనిం గైకొనం బోలుఁ గా
నుకగాఁ దెచ్చెనె కానిచో నతఁడు నన్నం జౌకగాఁ జూచునే. 47

శా. ఔనే తార శబాసు మెచ్చవలె నా హానీగుణం బింకిటన్
వానిం జూచిన నీకు నిన్నుఁ గనుఁగొన్నక్ వానికిన్ శోకసం
ధానం బొందఁగఁ జేసినప్పుడుగదా, నా కూచి లేకున్నచో
నే నేరంభనె యచ్చరల్ వాగఁడఁగా, నీ పేరునం బిల్వవే. 48

క. అని నిశ్చయించి రోషం, బినుమడిగాఁ జీటి యిచ్చి యేమేమో మం
తనమాడి పొమ్ము పొమ్మని, తన బోటిం బనుపఁ ఘునపదస్ఫుటగతియై. 49

చ. అది చనుదెంచి నందన వనావనిఁ జప్పుడు కాకయుండఁ గెం
పొదవిన చూడ్కితోఁ బరిజనోత్కరముం జడ మర్రి చూచుచున్
గుడిగొను సూటి గాఁగఁ గనుఁగొంచు మెఱుంగుల నంట వింట బె
ట్టిదముగ గువ్వతండము వడిం బడ వేయు జయంతు చెంతకున్. 50

గీ. చేరి మారంభ పనిచె నీ చీటిఁ జూచి, కొమ్ము నీవంటివానికిఁ గొదవగాదె
యాట దానికి నింతమత్తా యిదేటి, మోహమయ్యెయటంచు నమ్మదితవలుక. 51

క. ఆ చీటిఁ జూచి వేలుపు రాచూలి మెఱుంగు కలకరాఁ జేటి దెసన్
జూచి విసుమింతె విటులకు, మీ చెలికిన్ జూడు నేఁడు మెచ్చు నుటెంతుక్. 52

గీ. అనిగిఱుకుఁ గేరఁ దిరిగి యయ్యమరనాథు, పుత్రుఁ డందఱి నిండ్లకుఁ బోవబనిచి
సురగ చురదుర నాయింటి కరుగుదెంచి, యేమి చెప్పదుఁ బొదరింటికేగుదెంచె. 53

మ. అపుడే గ్రొవ్విరులందె యాలజ ధనరాజాపత్య మచ్చెంపు ని
క్కపుఁ బ్రేమన్ జడయల్ల నేమడు పాసంగం బట్టి చేనొక్కి నే
రుపుతో నిచ్చినఁ గాని యొల్లనని మారోన్మాదమైన నేనంతఁ బ
ల్కుపరాకింద మటంచు మల్లెయొసగం గోపంబు దీపింపఁగన్. 54

క. ఛీపోవన్నా నరకూబర కానీమన్నా యటంచు గ్రక్కునఁ దిరిగెన్
దానుం జనె నర్థేంద్రజుఁ డేనుక్ భయమొదవ నింటికేగితి నంతన్. 55

క. నూరెలను నిద్రజుఁడు కో, లారికమందిన నతండు లలితోల్లాసం,

బారంగఁ గొదవడెనా యీరీతియు మంచిదని ప్రియంబునఁ బలుకెన్.

సీ. ముడిపువ్వుటొత్తులు మూఁడువేళలఁ దెచ్చియిచ్చువారలయిష్టమెల్ల గలిగెఁ
జనువుతో దారికట్టును మొనకట్టును దెలుపు వారల మనువులు ఫలించె
నింత మాత్రమునకు నీవేల నేబూనికొనియెదవనివారి కోర్కులాడవె
కైపంట వింతగా గైసేయు సూడిగంబుల వారి యాప్తవిస్ఫురణమించె
జౌర దాతలరాయ బ్రహ్మోదయు ననెదు, వారికెల్లను ధనములవ్వారియయ్యె
నొంటిపోట్లాట తత్తరంబునన మేని, వాంఛయుంజక వర్తించు వారివలన. 56

సీ. బొక్కసంబుల బీగములు జెచ్చి సొమ్మెల్ల వెట్టి యెత్తినరీతి వెచ్చబెట్టి
గెలిచిన నౌనెకా తలఁప వేఱొకటైన పయ యుంచుఁడనుచుఁ బెద్దలకఁ దెలిపి
వడిరోసమెత్తి పైఁ బకకెచ్చరించి చెంగట నిల్వుఁడని నేస్తకాండ్రఁబలికి
చెల్లుగా మనసువచ్చిన పదార్థములెల్ల నరత వ్రతీరంగ ననుభవించి
యోర్వఁద్దరు తమలోన యెననికొక్క, యీ చెలి యటంచుమదిలోన హెచ్చరించె
పొగలపెట్టెలఁ నునుఘట్టిపౌరల పరల, తెల్లవారక మును బయల్ దేరుటయును. 57

వ. అప్పుడత్యాశ్చర్య చర్యాధుర్యంబగు నక్కార్యంబు పౌరలు విని కిన్నరులాలించి విద్యాధరులు చెవినిడి కిన్నరులాకర్ణించి వెరగుపడం దదాప్త పరంపరానువాక్యంబుల నెక్కడెక్కడ యని తత్తరంబునఁ బరువెత్తు వారును నే మేమి యని యడిగిన విస్తరింపక జయంతనల కూబరులంట యనుచుం బరుచు వారును తారనిమిత్తంబున నెంత పుట్టెంగంటిరే యెంత గర్వ్యాళి యనుచుం జనువారును నింద్రనందనునకు బందాకోరైన యీరాజానదన కుబేరకుమారునకు లోనైన యప్పాడే వివాదంబు సిద్ధంబను వారును వెలకొమ్మలమనంబులనమ్మవచ్చునే యనుచు నవుగు వారును నిట్టి యెడంబుట్టిన రోసంబులు వారింప నెవ్వరి తరంబనుచుఁ దమ యేలికలకు నెప్పటి సమాచారంబులప్పటికిఁ జీటులువ్రాయుచుఁ గ్రక్కున నంజనవలెఁ జిమ్మి యనుచు వేగులవారి నెచ్చరించుచుఁ బోవు నియోగులును ఘొల్లునఁ గేకలువైచి కేరుచుఁ జంగునఁ దాటుచు నేఁడుగదా వేఁడుక చూడఁ గలిగెఁ గదా యనుచు గమకించు కోడెకాండ్రును గాయంబులు గట్టుటకు మందుసంచులు బుజంబులవ్రేలాఁడ బొజ్జలదరంజను వేలుపు వెజ్జులును చేటికావిదిత తదీయవృత్తాంతంబు విని యమ్మక్క యీచక్కని నారలకెక్కడ నుండి వచ్చెనే యనుచు మేడలెక్కి కనుంగొను నవరోధగిరి ప్రమోదరులును గన్నుంగని యెంతసిగ్గరివి తలయెత్తవే నంగనాచియనుచు మాటలు పాడుచువారును నింక మీఁదముచ్చటలు చెల్లునే యను మదలఁ బంకించు న

చ్చరమెఱుంగుబోఁడులును నైయమరావతీపురంబువారంపఱును సందడింపఁ బురం
దరుండు హెగ్గడికత్తియల వలనవిని డిగ్గున లేచి శచీమత్తకాశిని దుఃఖాయత్త
చిత్తంబుతో నచ్చటికి వత్తుననుచుం దత్తరింప బొమముడితో నతిరూక్షంబగు వీ
క్షణంబున నిలువరించి నగరు వెలువడి తమకంబునఁ బైటికిం జనుచెంచెనంత నంత
యు విని యఖిలదిక్పాలకులును బ్రహ్మాదిదేవతలు నేతెంచిరట్టియెడ. 58

సీ. మనకేమి పని చూచికొని యుంద మీవేమి యనఁ బోకుమీ యనియనుసరించి
నీప్రశ్న మిచ్చుట నీపగ్గె నెరయించి బోరు దీర్పఁగ మంచుఁ బొందుపఱచి
మనచేతఁ గాదు వీరిని శాంతుల నొనర్ప నూరకుండెదమంచు నొద్దనిలచి
నానోటి కడికి విఘ్నముఁ జేసినపుడె శపింతుఁ జుమ్మీయని బెదరఁ జేసి
వారి వైరంబుఁ బురికొల్పఁ జేరి నార, దుండువీణగవిశనను దొలఁగఁ జేసి
మెట్లుతడఁబడఁ దురుకుగా మేళవించి, నిలువవారిద్దరును రణోన్నద్రులైన. 59

క. హరిహయుఁడుఁ గుబేరుఁడు ని, ద్దరునొగి నన్నలువ యపగుఁ దమ్ములప్రవాలన్
గరుణించి సకలదేవో, త్కరములతో నతఁడు నిలచి తన్మన్యమునన్. 60

గీ. వలదనిన వారిలో డుస్సి వైచి నట్టి, కైదువులజూచి బలికె నే కన్మోరంగ
నొరుల వైతురెయంచు నొందొడ్డికొనుచు, నవునెకద యంచునతఁడుండు నవసరమున

శా. అయ్యో కావరె యాడుదాన నబలన్ హా యెవ్వరింగాననా
కుయ్యాలింపరె నన్ను నెత్తికొని దిక్కుల్ చూచుచుం బారెడిన్
దయ్యం బీతని నెవ్వరేని నిజఖడ్గప్రోద్యదుగ్రాగ్నికిం
ధాయ్యంజేయక యాడుదీవెనలఁ బొందం లేరె నేమ్రొక్కెదన్ 62

క. అని యెడు నాడుమొరల్ విని, వనజుఁ డిది తాళకేతు వర్తన మరయన్
ము[illegible]దేవ గురుఁడుశపియిం, చినచందము నిట్టిదనుచుఁ జింతించునెపన్. 63

క. ధనరాజసుతుజయంతుం, గనుఁగొని యాచాయ వచ్చు కరివ్యాదుని వ్రే
లునఁ జూపి వీని నిద్దరు, దునుముఁడు పొండనినఁ జంపదోర్మండునులై. 64

క. డేగవెరచూపు నిగుడెడు, వేగంబున నిగుడు దనుజ వీరుని బుజముల్
ప్రోగువడఁ బంచికొనుచువి, భాగించిరి తనువుతోడఁ బాసిచనంగన్. 65

వ. అంత

సీ. నిగనిగనిగని పెన్నెరిగెంపు ముడివీడి తనదీర్ఘరీతి యందఱికిఁ దెలుప
నపరుపాటునఁ జూచు చదురు చూపులవల్లఁ గలువ వసంతంబు గలయఁజల్ల
నుసుగక గుండెయుఁ దడఁదడమనుటఁ గెంపుల దంప జనుఁదోయి పుటములెత్త

గడె గడె మను మేను గలిగెఁ దోడుగ నంచు నసియాడు కొను సంతసము జెంద
వీడు పయ్యెద పసివాళ్ళువాఁడు మోము, నడుగు దడఁబాటు నెమ్మేనఁ బొడము చెమట
మెఱయ రక్కసుచే వీడి మీనన యన, యచ్చరలగుంపుఁ జేరంగ ననుసరించె. 67

గీ. అంత దేవత లెల్ల జయంతధనద, పుత్రకుల నొక్కటిగఁ జేసి పొంకపఱచి
సెలవులకు నేగఁ జాలు నానింపతప్పె, ననుచు నేదానిఁ దోడ్కొని యఱుగు దెంచి.

క. నాయింట నునిచి మఱియ, త్తోయజముఖి తనకునాఁడుఁ దోడుగఁ జెలిమిం
జేయుచునుండఁగ నొకనాఁ, డాయమ ననుఁజూచి వికసితాననయగుచున్. 69

సీ. వినవమ్మ కుండల యనుదాన నలవిభావసుకుమారిక మదాలసయు నేను
గ్రీడింపఁ బాతాళకేతుండు గొనిపోయి మందరభూధరంబందు నిల్పి
నచటికిఁ గువలయాశ్వాధీశుఁ డేతెంచి దనుజేంద్రు ఘోరయుద్ధమునఁ ద్రుంచి
మముఁ దోడికొనిపోవ మఱి వాని యనుజుండు తాళకేతుఁడు మహోత్తాలలీల
మాయచే మమ్ముఁ దోడ్కొనిపోయి మేరు, మందిరములందునునుప నమ్మందగమన
గాన నొకనాఁటిరాత్రి నకాంతఁ దలఁచి, తలఁచి పొగులుచునున్న నద్దనుజుఁ డెఱిఁగి.

గీ. వెనుకవచ్చెద నీవేగు మనుచు దాని, మున్ను గానంపఁ బోలు నీవన్నెలాఁడి
మోసపోయిన నిదియును మొఱఁగిపోవు, ననుచు నొకయాగ్రహముఁ జెచ్చుకొని యతండు.

క. వేఱొకతావున నునుపం, గోరికమై నన్ను నెత్తికొని చనుదేఁగన్
మీరలఁ జూడఁగనైనది, మీ రెఱుఁగుదు రింక నేల మీపటివార్తల్. 72

క. నాకత యిత్తెఱఁగయ్యెన్, వ్యాకులమున నింత కమ్మదాలస నెటకుం
దోకొనిపోయెనో దనుజా, నీకంబులచేత నెంత నెగులొందెనో. 73

చ. తనువులె రెండుగాని వనితా మఱి ప్రాణములొక్కటమ్మ మా
కని పలుకంగ సిగ్గుదలకయ్యెడు నట్టి ప్రియాళిఁ బాసి యీ
యనువునఁ బ్రాణముల్ నిలిపినట్టి కతంబున దానిఁ జూడ కుం
డిన నిమిషంబు తాళఁగలనే! మఱి యెచ్చటికేని నేగెదన్. 74

గీ. అనిన నూరార్చి యవ్వార్త నరసి నత్తు, నుండుమని దాని నాయింట నునిచి యేను
బువిమిపై దిగ్గివచ్చితో నదుమఁ గంటి, నారదుని చేత నీవు చందంబులెల్ల. 75

క. విని యిచ్చటి కరుదెంచితి, మనమువ్చట లెల్లఁ దీర మనకుండలనుం
గొనివచ్చెద నని తాఁ, నా కేతుజు నినియు నిజనివాసంబునకున్. 76

ఉ. ఆసమయంబునం దా [illegible]
తొ [illegible]

యాసముతో వశీకృతికినై రజమెత్తఁగఁ బూజవెంబడిం
జేసిన రీతి మించి యతిచిత్రజవంబున వచ్చిమచ్చికన్. 77

క. అక్కడ బుతధ్వజుఁ డఁట యతఁ, డిక్కడికేతెంచెనఁట ఫణీశ్వరుఁడతనిం
గ్రక్కున నెదుర్కొనఁజనె, ఢక్కాపటుపటహతమ్మటధ్వనులొలయన్. 78

క. నగరికిఁ జని కెంపులపని సొగసులుగల మేడయెక్కి చూతమె యనినన్
మగువసిగమిన్నయరిగెన్, మొగమలరం జేటికాసమూహము గొలువన్. 79

ఉ. అంత భుజంగపుంగవుఁ డుదారతురంగశతాంగకోటితో
దంతిఘటాఘటాగ్రబహుధావిగళన్మదధార మార్గసీ
మాంతరమందు జల్లు కలయంపులకుం బునరుక్తి నింపన
త్యంతముసంతరంగుల్ల నిజాత్మజులం గనుఁగొంచు వచ్చినన్. 80

గీ. అచట మున్నె తరుచ్ఛాయ నాశ్రయించి
యున్న యానరలోకమాన్యుండు నప్పు
డెదురుగాఁ జని తోడ్కొని యేఁగి యచట
నుచితకృత్యంబు నడుప నయ్యురగవిభుఁడు. 81

గీ. లేచి నిలుచున్న మంత్రులఁ జూచి రాజు, గారి గుణకథనంబు లవ్వారిగాఁగఁ
దెలుప విన్నందులకు మేము పిలువనంపి, నపుడె వచ్చినయందులకు ననుగుణంబు. 82

క. అని సన్నుతించి విడిదికిఁ జనుఁడెంచని కుంభినీంద్రజంభారిం దో
డ్కొని చని యట నలుపొ నిం, డినయొక గేహమున విడిది నియమించె వెసన్. 83

చ. అతనికి నమ్మదాలస యుదారకథాభ్యుదయంబుఁ జెల్పి యో
క్షితి[illegible] పెండ్లి యిచ్చుటనె చేయుతలంపున నిన్నుఁ బిల్వఁబం
చితినని సంబరం బొదవఁజేసి ఫణీంద్రుఁడు పట్టనం బలం
కృతముగఁ జేయఁబంచె బహుకీతి ముహూర్తము నిశ్చయించుచున్. 84

క. అంతఁ గుండలఁ దోడ్కొని యరుగుదెంచి, తారయంతయు విని మోదవారిరాశి
మగ్నయై తద్వివాహసంభ్రమముఁ జూచు, తలఁపు బొడమిన నచ్చోటనిలిచెనంత.

క. ఎలమి నల చిలువరాజేఁ, చెలిచెల్వుఁడు పెండ్లికొడుకు సింగారింపన్
జెలులను బనిచిన ననిచిన, తలఁపుల వారరిగి వసుతోతు లింపొసఁగన్. 86

చ. పనిహారువుం బెనంగొనిన బంగరునిద్దఁపుఁ బొజ్జిపీఁటపై
జనపతి నుంచి యొక్క యెలజవ్వని మేల్ బురుసా రుమాలు గుం
డనపు మెఱుఁగుసైఁ గపఁగఁ దాయెతుచేరుల నింపఁ దావి ఘు

మ్మను విరిపువ్వుకైతుల నొయ్యారముగా సవరించుచునంతటన్. 87

మ. తళుకుం బాపటబొట్టు చందమున నృత్యంబాడు నాసామణిం
బలె నర్తించు సరంబురీతి నటనప్రావీణ్యముం జూపు గు
బ్బల హాసద్వయ కంకణధ్వనుల సేబాసంచు మెచ్చందమిం
దలయం టెం దరళాక్షి యొక్కతె ధరానాథాన్వయస్వామికిన్. 88

క. ముందుగ నిగ్గులనీలము, లొందింపక చిక్కువడక యుండన్నెఱులన్
గందపుటటక లిడియెనొక, యందపునెఱవన్నెలాఁడి యన్నరపతికిన్. 89

మ. జలముల్ తెచ్చిన పైఁడిబిందియల మెచ్చంబోని ఘర్మాంబుకం
దళపుం జన్నులమిన్నలీయ లతలానందమ్మునం దేనెసో
నలు నించన్ నలువొందు తుమ్మెదలనన్ రాజిల్లఁగాఁ బెన్నెఱుల్
జలకం బార్చిరి కొంద ఱింగుముఖులాసర్వంసహానేతకున్. 90

చ. చలువలొసంగి పేటిక పొసంగ మెఱుంగు పరంగిపీఁట న
న్నెలఁతలు రాచ కొమగని నిల్పి కురుల్ తడియార్చి గోరులం
గలయఁగ దువ్వుచున్ హొయలుగా సిగవైచి మెఱుంగుముత్యమున్
సులికదు బాసికంబు పగఁగట్టి రుమాలువు గట్టిరంతటన్. 91

గీ. కలికియొక్కతె పెట్టె చొక్కట్లు పెట్టె, ముదిత యొక్కతె నీలంపుమురువు నిలిపె
రమణి యొక్కతె పచ్చతురాయి మర్చెఁ, గాంత యొక్కతె తెలిపతకంబు లిడియె. 92

క. ఈరీతిఁ జెలులు నృపసిం, గారించి యనంతభుజగకాంతుపనుపునం
దారమొదలైన వారొ, య్యారింగైసేయ నిర్భరానందమునన్. 93

వ. భుజఙ్గపుంగవుండభంగురత్వారాయత్తచిత్తంబుతో బడిబడింబనుపఁ బుడిబుడిం
జనుదెంచి యమాత్యులు ముహూర్తం బాసన్నం బయ్యెనంచుఁ విన్నవించినం బ్ర
సన్నవదనంబుతోఁ జిన్నివెన్నెలతో సరిమన్నెఱకంబు స్ఫురించు కప్పురంబులతోడి
విడియంబు లొసఁగి గద్దియ డిగ్గి ముద్దియలొసంగు కైదండఁ గొని విడిదివెలువడి
యుద్దండగండమదభారావిభ్రమద్భ్రమరీ మండలంబగు వేదండంబు నెక్కి వామ
హస్తంబునం బ్రశస్తమణిగణోత్కీర్ణంబగు నంకుశంబునం గుంభంబులూఁది వెనుకం
దగు నూడిగంపుఁ జేడియ లందియిచ్చు పానపడుం దెలనాకుమడుపులకుం జాచు ద
క్షిణకరంబునం బొసంగు నుంగరంబులం జెలంగు మగిడాల డాలు పరిచారకుల పై
వెలిపావడలతో పీడఁజోడాడ నిజప్రకల్పితతరంగతురంగవాహిన్నిగ్రుండగుటకు
మెచ్చి తరణియనిపినకిరణసహస్రంబులనం బెంపుఁగను కరదీపనికాయంబులు తే

లతలనం బ్రతిఫలించి గజాంబుధిరాజపుత్రికారాత్రికంబు సవరింపం బరంపరలై బా
రు దీరు ప్రతాపాంకురంబులనం బరఁగు బురుసలతోఁ గురుంజులపైఁ దిరుగు నురగ
కరిగమనల వలయాకారపరిభ్రమచ్ఛిరోమణీనికాయంబులకు సంగడీలై తురంగ
లింప రంగదుత్తుంగభర్మ్యహర్మ్యాంగనావికీర్ణలాజాసమాజంబులు భానుకల్పితం
బులగు ముత్తెంపుఁ దలఁబ్రాలునకు స్మారకంబులై రకంబుఁజూప వింతకోపుల
నాఁడు వేలచేడియల మైసిరియొసం దళుకుతళుక్కుమనం బిక్కటిల్లిన వెన్నెల ల
క్షీణమణిగవాక్షంబుల వలనం జూఁడు నవరోధగిరి పయోధరల మొగంబుల ముస్తు
బ్బుబయలు చేయ సర్వసన్నాహంబు మెఱసి యరుగుదెంచిన కువలయాశ్వనశ్వత
రోరగేశ్వరుం డెదుర్కొని నీరాజనాద్యుపచారంబులు నడిపించి తోడ్కొని చని
వివాహవేదికాంతరంబున సుఖసమాసీనుం జేసిన యనంతరమున. 94

చ. వరుస మెఱుంగు బాసికపు వజ్రపుఁ గుచ్చుల గచ్చుపైఁ బరా
బరి యొనరించు ముత్తియపు బావిలినిగ్గు పరాకుఁ దెల్ప స
బ్బరమగుఁ గొంకుఁజూపు దొరపాదనఖద్యుతి మీఁదినేరమే
యరయ వివాహవేదికకు కల్లమదాలస వచ్చినిల్చినన్. 95

సీ. తరుణులు వెలిపట్టు తెరవట్టఁగా నశ్వతరుఁడు దీవిపసిండి తళుకుగిండిఁ
బన్నీరువంప భూపాలు పాదాబ్జముల్ కడిఁగి కన్నియమాట కరణిఁదనరు
మొనగిక్రొంజిగికట్టు ప్రాలపుట్టికలపైఁ బలియుసలియు
నిలిచిన ముద్దుగుమ్మలసోబనపుఁ బాట నిజపురోహితవేదనినదమఖిల
వాద్యఘోషంబు ఘనవైభవంబు మెఱయ, దారవోసెను పదపడివారుకొంకు
సిగ్గుఁ దమకంబుఁ జిఱునవ్వుఁ దొంగలింప, మెండొరులమాట వీక్షింప నుచితరీతి. 96

మ. కులుకన్ సందిటఁ జెందు మైలతిక క్రొంగుల్ రంగులీనంగఁ గ
మ్మల డాల్ చెక్కుటఁ జల్లుకీలుగొనఁ గొమ్మల్ చేరి పోయించఁగా
బలు తీవుల్ పచరించు చూపుజిగితో వాదించు ముత్తెంబులం
దలఁబ్రాల్వోసె వధూటి భూధవసుధాధామోత్తమాంగంబునన్. 97

క. అంగాంగసంగతిని దన, ముంగై చెమరింపఁ గంఠమున సతికిన్ రా
జాంగజుఁడు కట్టె మణిమయ, మంగళసూత్రంబు జాయమానోత్సాహుఁడై. 98

క. తాలిమిఁ బురోహితుఁడు మం, త్రాళుల్ చదువంగ నిర్భరానందమునం
గ్రీలిఁదగ దంపతుల్ మఱి, వేలిమి గావించి రుచితవిధమున నంతన్. 99

గీ. మంత్రము లెసంగ సన్నికల్ మట్టఁ జేసి, రప్పుడు పురోహితనయంబులంతెనురగ

కాంతు లందఱుఁ గట్టువర్గములగములు, వరుసఁ జదివించి రవ్వధూవరుల కెలమి. 100

వ. ఇవ్విధంబున వివాహమహోత్సవంబు ప్రవర్తిల్లినం దినచతుష్టయానంతరంబునం బ్ర
వి ప్రయాణోన్ముఖుండైన కువలయాశ్వునకు నశ్వతరుం డనేకవస్తువులరణంబొసఁగి
మదాలసావిలాసవతికిఁ బుద్ధులు గఱపి కుమారద్వయంబును దారాకుండలాదివేదం
డగమనలను వెంటం గూర్చి యనిపిన రథారూఢులై వారు గోమతీనదీముఖంబునఁ
బాతాళలోకంబు నిర్గమించి శోభనాలంకారాకారంబగు నయోధ్యాపురంబుం బ్ర
వేశించి గృహప్రవేశంబు గావించి యున్నమఱునాఁడు దినాంతసమయంబున. 101

ఉ. ముంగల నుబ్బుచప్పరము ముత్తెపు ముగ్గులుఁ బూలమేలుక
ట్టుం గొదలేని చిత్తరువులున్ బురుసాపనితోడిమంచముం
జెంగట బీరువాంగముల చెల్వము గల్గిన కేళిగేహసీ
మం గమనీయవేషమున మానవనాయకుఁడుండు నయ్యెడన్. 102

గీ. తార కుండల ముఖ్యలైన తలిరుఁబోఁడు, లమ్మదాలసఁ జూచి రావమ్మ నీకు
వరశుభప్రాప్తి చేకూర వలయు ననుచు, ననుచు వేడుకఁ దమలోన నవ్వుకొనుచు.

చ. జలకముఁ దీర్చి పావడ కశల్ వడిమార్చి మడిచి వేచి జాలువా
వలిపెముఁ గట్టి [illegible] యిరీతి గా
[illegible] పిసాళికస్తురిం
[illegible] గని వాఁకలత్తుఁడిన్. 104

సీ. అన్నియుఁ దెలిసిన వన్నెలాఁడకి నీకు దెలిపెడిదేమమ్మ కలువకంటి
వినవమ్మ [illegible] వాని మనసు చూపఁగఁ గంటుఁబడను వంటిదిసుమీ పద్మగంధి
యిన్నాళ్ళవలెఁ దోడి యింతులతోడి యాటలు గావుగద యిదితలిరుఁబోఁడి
యిదివఱకటి మనమెట్టు లెనయించెదో నేఁడు నీ నేర్పుచూతము నీరజాక్షి
యిక్కడనె యింతసిగ్గైన హృదయనాథు, నెట్లు గరఁగింప నేర్చెదే యిందువదన
భావమెఱిఁగినజాణవుగా వెసమయ, మెఱిఁగి తటతటపు సేయుమీ యిగురుబోణి. 105

గీ. అనుచుఁ దోతేఱ నప్పుడవ్వనజవదన, సిగ్గు వెనుకకుఁ దిగువ నెచ్చెలులఁ జూచుచు
మాటమాటికి [illegible] మందగమన, మినుమడింపఁగఁ జనికేళిగృహముఁ జేర 106

క. వనజాక్షులందఱొక్కొక, పనినెపమునఁ జరుగ సరసఁ బగడపుఁ గంబం
బును జాఁటుగాఁ గొనుచు ని, ల్చిన తరుణిం జూచి విభుఁడు చిఱునవ్వొలయున్. 10

గీ. లేచి నిలువున నే కౌఁగిలించుకొనుచు, విరులపాన్పుననుంచి పెన్నెఱులు దువ్వి
కప్పురపుఁదావి గుప్పు బాగాలొసంగి, పాదలి తమకంబు [illegible] గించి.

సీ. అలరులానినీ తుమ్మెదలా నిక్కపుఁ బ్రనంగో తరుణిమ [illegible] దువ్వి

కమ్మబంగరు సిగ్గొ కలిగినపలుడాలో చెలువమూతమటంచుc జెక్కునొక్కి,
ముక్కుచి ముత్తియంపు మెఱుంగొ లేనవ్వొ ముదితమూతమటంచు మోవిపుడికి
కుంకుమ జిగియొ నెక్కొను గుంపుదండయో కొమ్మమూతమటంచు గుబ్బలంటి
తెలివియైమీరు నూగారు దీప్తియొక్కొ, మేలి మెలనూలి నీలమో మెఱుఁగుబోఁడి.
మూతమని పోకముడివిప్పి సుదతిఁగరఁచి, యించువిలుకాని సామ్రాజ్యమేలివిభుఁడు.

క. అంతట వేఁగిన ధరణీ, కాంతుఁడు సంధ్యాదికములు గావించి ప్రజన్
సంతసమునఁ బాలింపుచు, నింతింగవఁ గూడి సౌఖ్యమెనయుచు నుండెన్. 110

వ. మునీంద్రా! మార్తాండదత్తంబగు కువలయాశ్వంబు వలనం జయంబందుటంజేసి ఋతధ్వజుండు కువలయాశ్వుండనం బరఁగెననిన సంతోషధుర్యుండై జైమినిమౌని యప్పి హంగమములం బూజించి సుఖంబుండెనంత. 111

క. ఈకువలయాశ్వచరితముఁ, గైకొనిచదివినను వినినఁ గారుణ్యసుధా
శ్రీకరుఁడు కృష్ణుఁడొసఁగున్, శ్రీకరముగఁ బుత్రపౌత్రచిరవిభవంబుల్. 112

శా. పూర్వగ్రస్తవినిర్మలత్వ బహిరుద్యద్వారకీర్త్యంకురా
ఖర్వచ్ఛాయ కరస్థఖడ్గ, సబలాకారేఖ మేఘోల్లస
త్సర్వాశౌఘతమిస్రఘస్మరమహాసౌదామినీమాలికా
గుర్వర్థార్పణ హృష్టయాచకజనా కోదండలీలార్జునా. 113

క. ధాటీకరటి ఘటారథ, కోటీక్షిత్యారికుంభికుంభతటమణీ
కోటీవైవాహికము, క్ష్మాటీకనవిజయమాశ్రితకరాంబురుహా. 114

మాలిని—పరిభృఢభుజతేజా భానుమద్బింబభానూ
ద్భవమహారిదబలాంగ స్థాయిఘర్మోదబిందూ
భవదనభిముఖాసి భ్రామ్యదైభాసమాస్తా
ప్రవివృతబలతేజా ప్రౌఢకీర్తిప్రకాశా. 115

—గద్య.—

ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమన్వయాభరణ నారాయణభూపాలతనూభవ శరగోపతాపసేంద్రచరణారవింద సంచలన్మానసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహర రూపరేఖావిజితచైత్రకాశ్యపగోత్రపవిత్ర జాతివాతాకకవిజనామోదసంధాయక చిననారాయణనాయకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రంబను మహాప్రబంధమునందు సర్వంబును బంచమాశ్వాసము.

సమాప్తము.

## సరస్వతీకార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | మాలతీమాధవీయము ... | రు. ... | 0 | [illegible] | |
| 2. | రాయనభాస్కరమంత్రిచరిత్రము ... | ... | 0 | [illegible] | [illegible] |
| 3. | శ్రీరామేశ్వరయాత్రాచరిత్రము ... | ... | 0 | 3 | |
| 4. | మార్కండేయపురాణము ఎఫ్. ఏ. టెక్స్టు 1903-04 | ... | 1 | 4 | |
| 5. | శకుంతలాపరిణయము ... | ... | 0 | 8 | |
| 6. | హిందూగృహము ... | ... | 0 | 1 | |
| 7. | మనుష్యవాంఛానిష్ప్రయోజనత్వము ... | ... | 0 | 1 | |
| 8. | నేలబొగ్గు ... | ... | 0 | 1 | |
| 9. | భువనమోహిని ... | ... | 0 | 4 | |
| 10. | మిల్లరుదొరవారిజీవితము ... | ... | 0 | 1 | |
| 11. | అపవాదతరంగిణి ... | ... | 0 | 6 | |
| | డిటో సరస్వతీచందాదారులకు | ... | 0 | 4 | |
| 12. | విజయవిలాసము ... | ... | 0 | 6 | |
| 13. | కాటక్ దొరగారిచరిత్రము ... | ... | 0 | 1 | 0 |
| 14. | సాహసికకథార్ణవము (చిత్రమైనకథలు) | ... | 0 | 6 | 0 |
| 15. | నన్నయభట్టారకచారిత్రము ... | ... | 0 | [illegible] | 0 |
| 16. | నిరంకుశోపాఖ్యానము ... | ... | 0 | 6 | 0 |
| 17. | హరవిలాసము ... | ... | 0 | 8 | 0 |
| 18. | బాలరామాయణము (ప్రథమభాగము) | ... | 0 | 8 | 0 |
| 19. | సౌందర్యతిలక, (నవలు రెండుభాగములు కలిసి) | ... | 0 | 14 | 0 |
| 20. | శ్రీమత్పరమహంసరామకృష్ణులు | ... | 0 | 5 | 0 |
| 21. | కేయూరబాహుచరిత్రము | ... | 0 | 6 | 0 |
| 22. | సంస్కృతనాటకకథాసారము | ... | 0 | 12 | 0 |
| 23. | [illegible] | ... | 0 | 10 | 0 |
| 24. | రాజతరంగిణి (ప్రథమభాగము) ... | ... | 0 | 8 | 0 |
| 25. | బుద్ధచరిత్రము ... | ... | 0 | 10 | 0 |
| 26. | శివాజీచరిత్రము ... | ... | 0 | 10 | 0 |
| 27. | [illegible] కామారుతప్రకరణము ... | ... | 0 | 14 | 0 |






ఈ గ్రంథములు గోరువారు సరస్వతీమేనేజరుగారికి కాకినాడ వ్రాసి ... నైనను సొమ్ముపంపియైనను తెప్పించుకొనవచ్చును.